ఒక్క మాత్రయే
"గుటుక్"
తలనొప్పి పోయే
"చటుక్!"









ఎక్స్‌ట్రా స్ట్రెంగ్త్
ఆస్ప్రో
600

మునుపెన్నడూ లేనంత బాధ నివారణ శక్తి కేవలం
ఒక్క బిళ్ళతో
వెంటనే పూర్తి ఉపశమనం యివ్వడం కోసం
అధిక శక్తి గల ఎక్స్‌ట్రా స్ట్రెంగ్త్ ఆస్ప్రో 600 లో వుంది, ప్రపంచంలోకల్లా అత్యంత ప్రభావంతో తలనొప్పిని పోగొట్టే నివారణ పదార్థం 600 మి గ్రా

**ఎక్స్‌ట్రా స్ట్రెంగ్త్**
**ఆస్ప్రో 600**
**శక్తితో, తప్పనిసరిగా, తొందరగా పనిచేస్తుంది.**

daCunha vp/84

దాసరి నారాయణరావు



విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్

లక్ష్మీ ఫిలింస్







నిర్మాత: టి. త్రివిక్రమరావు M.A.,

సంగీతం: చక్రవర్తి, కెమెరా: కె.యస్. హరి, కూర్పు: కోటగిరి వెంకటేశ్వరరావు

నిర్వహణ: టి. ప్రద్యుమ్నరావు B.Com

VBS.




## ముఖచిత్రం

30–12–83 అట్టమీద ముఖచిత్రం ఫొటో తీసిన శ్రీ జి. కె. నరసింహంగారికి నా ధన్యవాదాలు. రాధ, జయసుధ నిజంగా పాఠకుల యింట్లోకే నేరుగా వచ్చినట్లనిపిస్తుంది.

జె. శివప్రసాద్, యలమంచిలి

* * *

30–12–83 నాటి పత్రిక నా అభిమాన తారలు జయసుధ – రాధల ముఖచిత్రంతో వెలుబడిన పత్రిక నయనానందకరంగా ఉండి ఆకర్షించింది.

వి. మురళి, వేణు, లక్ష్మి, గద్వేల్.

## రిజర్వ్ చేయడం న్యాయం

నటి లక్ష్మి తమ యింటర్వ్యూలో ఫార్వర్డు కమ్యూనిటీ విద్యార్థుల అవస్థలకు బోలెడు బాధ పడుతూ వారికి తమ గుండెలో కడివెడు అభిమానం రిజర్వ్ చేసినట్లు బుజువుచేశారు. లక్ష్మిని ఫీల్డులో నిలిపిందీ, ఫిల్మ్స్ (ఆమెతో) నిర్మించేందీ ఎక్కువమంది ఫార్వర్డు కమ్యూనిటీలవాళ్లే కావచ్చు గానీ- ఆమె ఫిల్మ్స్‌ను ఆదరించడంలో, ఆమెను అభిమానించడంలో 'డౌన్ ట్రాడన్ అండ్ బాక్ వర్డ్ కమ్యూనిటీ' వాళ్ల పాత్ర కూడా తక్కువదేమీ కాదు. అందువల్ల ఆమె లోయర్ కమ్యూనిటీ వాళ్లకు కూడా తమ గుండె లోతుల్లో ఏమూలో ఒక పిడికెడు అభిమానం రిజర్వ్ చేయడం న్యాయం.

జి. డి. ఎస్. విజయకుమార్, కర్నూలు.

## ధర్మపథం

శ్రీ బులుసు వెంకటరమణయ్యగారి "త్రికరణశుద్ధి" యథార్థంగా రచయిత వ్రాసినట్లుగా, త్రికరణశుద్ధి లేని వ్యక్తికి గౌరవం స్థానం – విలువ వుండవనేది సత్యం. నిజానికి వ్యాసంలో వివరించినట్లు సంసారి మొదలు వుద్యోగి, పూజారి, ఉపకారి, అధికారి – స్నేహశీలి – వరకు త్రికరణశుద్ధిని శుద్ధిచేసి బహుచక్కగా వర్ణించి వివరించారు. అలానే నా మిత్రునికి ఒక వ్యక్తి వాగ్దానం యిచ్చి – కాలం జరిగాక, "తొందరపడితే ఎలా? చూస్తానని వాగ్దానం చేస్తినిగదా!" అంటూనే ఆ పనికాస్త పరవారికి అంకితమైంది.

షేక్ మస్తాను, గాలిబీబి,
ముమ్మలనేనివారిపాలెం, రేపల్లె.

## ఆహారం – నేరప్రవృత్తి !

ఆంధ్ర సచిత్ర వారపత్రిక(30.12.83) లో ఆహారపు అలవాట్లకు, బాలల్లో ఏర్పడే నేరప్రవృత్తికి సంబంధం వున్నట్లు జపాన్ దేశ మనస్తత్వ శాస్త్రవేత్త గత పదకొండు సంవత్సరాలుగా పరిశోధనలు చేసి తెలిపారని చూచి చాలా ఆనందం కలిగింది. నేరప్రవృత్తి ఒక జాడ్యం అనొచ్చు. ఏదేని ఒక వ్యాధి నిరోధించడానికి తగిన మందు ఎంత అవసరమో అలాగే నేరప్రవృత్తిని నిరోధించడం చాల అవసరం. అంతేగాని నేరాలు పెరుగుతుంటే జీతాలు పెంచుతున్నట్లుగా వుంటుంది. నేరము అనబడే ఇనుప గొలుసులో స్వార్థం, బంధుప్రీతి మొదలైన రివిటు మేకులు ఇమిడి వుంటాయి. జంతువు నుండి మారిన మనిషికి యింకా జంతు ప్రవర్తన పూర్తిగా రూపుమాయక ముందే మత్తు పానీయాలు సేవించడానికి అలవాటుపడి మానవత్వం పోగొట్టుకుంటున్నాడు. పెద్దలను అనుకరించడం పిల్లల ఆచారం. బాలలు నేరస్థులుగా మారడానికి 'ఆహారపుటలవాట్లే కాదు యింకా యెన్నెన్నో కారణాలున్నాయి.

యమ్. జయభారతి, విజయనగరం.

[66వ పేజీ చూడండి]





## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం : 1908

***శివలెంక శంభుప్రసాద్***

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 27–1–84'

రుధిరోద్గారి నామ సం. పుష్య బ. దశమి

**సంపుటము 76 సంచిక 20**

సంపాదకుడు :

***శివలెంక రాధాకృష్ణ***

విడి ప్రతి వెల రు. 1-50

ఆరు మాసాల చందా రు. 42-90

పోస్టులో ఏడాది చందా రు. 85-80

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

'శ్రీవారికి ప్రేమలేఖ'లో పూర్ణిమ

*కథలు :*



*సీరియల్ నవలలు :*



**వ్యాసాలు, శీర్షికలు :**





# నకలు పనికిరాదు, అసలు కావాలి!




భారతదేశంలో శాస్త్రవేత్తల సమావేశాలని ఎందుకు పెడతారో నాకు అర్థం కాదు. ఇక్కడికి వచ్చే అంతర్జాతీయ శాస్త్రవేత్తలకి ఒక మంచి విలాసయాత్ర జరుగుతుందనేమో! ఈ మధ్యనే ఇక్కడ సుమారు 3000 మంది ఒక అగ్రశేణి సమావేశం జరుపుకున్నారు. జన్యు శాస్త్రాన్ని గురించి చర్చలు జరుపుకుంటున్నారు. సుమారుగా అంతమందీ కలసి "బయో మీటిరియాలజీ" అనే శాస్త్ర విభాగాన్ని గురించి చర్చించుకుంటున్నారు. అసలు ఇలాంటి శాస్త్రం ఒకటి ఉందనే నాకు తెలీదు! ఉన్నా ఇంతమంది శాస్త్రవేత్తలు దానిని అధ్యయనం చేస్తున్నారంటే ఆశ్చర్యంగా ఉంది. విజ్ఞానశాస్త్రం నాకు దూరమయిపోయింది. ఇప్పుడు మరీ దూరం అవుతోంది.

నన్ను కలవరపెట్టేది ఏమిటంటే — ఈ దేశంలో విజ్ఞానశాస్త్రం ఇంతగా అధ్యయనం చెయ్యబడుతున్నప్పటికీ ఇక్కడ అంతర్జాతీయ స్థాయిమీద శాస్త్రవేత్తలు తయారవటం లేదేమిటి? మనకి విజ్ఞాన శాస్త్రానికి ఒకే ఒక నోబెల్ బహుమతి వచ్చింది. అదీ, 1947 ముందే వచ్చింది. ఆ తరువాత ఇద్దరు "భారతీయ జాతికి చెందిన వాళ్లకి" నోబెల్ బహుమతి వచ్చినమాట నిజం [శ్రీయుతులు చంద్రశేఖర్, ఖురానాలు] కాని వాళ్లు ఇద్దరూ అమెరికాలో స్థిరపడిపోయిన శాస్త్రజ్ఞులు. వాళ్ల కృషి అంతా అక్కడే జరిగింది. వీళ్లిద్దరూ ఎందుకని అమెరికా వలస వెళ్లిపోయారు? ఇక్కడ ఉద్యోగాలు దొరకక, అంటే నేను నమ్మలేను. వాళ్లు ఎందుకు వెళ్లిపోయారంటే, ఇక్కడ వాళ్లకి తగిన వైజ్ఞానిక వాతావరణం లేదు కనుక. ఇలాంటి వాతావరణం లేకపోతే శాస్త్రాభివృద్ధి ఎలాగ వీలవుతుంది? వాదనకాస్తా కీచులాటగా మారిపోతుంది కదా! మన దేశంలో నలుగురు శాస్త్రవేత్తలు కలుసుకుంటే ఎక్కువగా బయటపడేది పిచ్చాపాటీ కబుర్లే — ఎవరు ఎన్ని దొంగ వ్యాసాలు ప్రచురించారు. ఎవరు ఎంత సమాచారం ఎవరిదగ్గిర దొంగిలించారు, వగయిరా.. నేనూ కొన్ని విజ్ఞానశాస్త్రవేత్తల సమావేశాలకి వెళ్లినవాడినే. వెళ్లి అక్కడ వెలువడే సంసార పక్షపు మాటలని విని కలవరం చెంది వచ్చేసిన వాడినే.

విజ్ఞానశాస్త్రం సంగతి ఇలాగ ఉంది. తక్కిన వాటిసంగతి ఏమిటి? ఆర్థిక శాస్త్రం సంగతి తీసుకుందాము. మన ఆర్థిక శాస్త్రవేత్తలు ముందు కొంతకాలంపాటు చక్కటి కృషిచేస్తారు. ఆ తరువాత ఎందుకనో ధోరణి మారిపోతుంది. వాళ్లు "ఆర్థిక శాస్త్రం రాజకీయా"లలోకి దిగుతారు. "జాతీయ ఆర్థిక అభివృద్ధి సంస్థ", "జాతీయ వినియుక్త ఆర్థిక పరిశోధన సంస్థ" వంటివాటిని కోట్లు ఖర్చు చేసి నిర్మించుకున్నాము. ఇవి ఎటువంటి పరిశోధనలు చేస్తున్నాయి? వాటిలో జరిగే కృషి విశిష్టమయినదని అనగలమా? వాటికి చెందిన మేధావులు ఆర్థిక శాస్త్రంలో కొత్త భావాలని వ్యక్తపరచ గలుగుతున్నారా? మన ప్రణాళికా సంఘాన్నే తీసుకోండి: ఇందులో ఎందరు మంచి ఆర్థిక శాస్త్రవేత్తలు లేరు? వీళ్లంతా కలిసి ఉత్తమమయినవనతగిన సూచనలని ఎన్నిటిని చేశారు?

అణుశక్తి సంగతి తీసుకుందాము. ఇప్పటికి మన దేశంలో రు. 5000 కోట్ల పయిగా అణుశక్తి మీద ఖర్చు అయి ఉండాలి. శ్రీనగర్ నుంచి, ఆళ్వాయి దాకా పరిశోధనా సంస్థలు ఉన్నాయి. ఆకాశంలోకి బాగా పయికి వెళ్లి వాతావరణాన్ని అనుశీలించేందుకు పరిశోధనా సంస్థలు ఉన్నాయి, భార జలాన్ని ఉత్పత్తిచేసే కేంద్రాలు ఉన్నాయి, అణుశక్తి ఉత్పత్తి కేంద్రాలు ఉన్నాయి, పయిక్లోట్రాన్‌లు ఉన్నాయి, భూకంపాలని కొలిచే సంస్థలు ఉన్నాయి, అణుశక్తి రియాక్టర్‌లు ఉన్నాయి — ఏమిలేవు అసలు! వీటన్నిటిలోనూ 10000 మంది శాస్త్రవేత్తలయినా పని చెయ్యరూ? ఇన్ని సంస్థలలో ఇందరు పనిచేసి సాధిస్తున్నదేమిటి? మన అణుశక్తి కేంద్రాలు బాగా పని చెయ్యవు. [కొన్నిటిలో అక్కడ పని చేసేవారికే అపాయకరమయినదనిపించే వాతావరణం ఉందని వినికిడి. ఇలాంటి అపాయాలని నివారించటం అసాధ్యం కాదు.] ఎందుకుపని చెయ్యవు? వాటిని నిర్వహించే వాళ్లు ప్రపంచస్థాయితో పోలిస్తే అగ్రగణ్యులు కాదు కాబట్టి. మన దేశంలో ఈ మధ్యనే తటస్థ దేశాల సమావేశమూ, కామన్వెల్తు దేశాల ప్రభుత్వాల అధినేతల సమావేశమూ జరిగాయి. వాటివలన కలిగిన ప్రయోజనం ఎంతో ఉండదు. అలాగే సమావేశాలకీ, సదస్సులకీ వెళ్లి వచ్చినంత మాత్రాన మన శాస్త్రవేత్తలు సాధించేది ఎక్కువ ఉండదు.

ఒక దేశం అభివృద్ధి చెందాలంటే ఆ దేశంలో భావాలు అభివృద్ధి చెందాలి. ఈ భావాలు నకలువి కాకూడదు. అసలువయి ఉండాలి. ఇవి ఆర్థికశాస్త్రం, భౌతికశాస్త్రం, జీవశాస్త్రం— దేనికయినా చెందినవయి ఉండవచ్చు. కీన్స్ షుంపీటర్, ఐన్‌స్టైయిన్, క్రిక్, టాగూర్ ఎలియట్‌లాంటివాళ్లు పుడితేనే దేశం బాగుప[డ] గలదు. ఇస్రాయిల్ సంగతి తీసుకోండి: ఇ[ది] చాలా చిన్నదేశం. కమ్యూనిస్టు రాజ్యాలూ అరబ్బులూ ఇస్రాయిల్ విరోధులే. అయినాసరే ఇస్రాయిల్ నిలబడగలుగుతోంది. అమెరిక[ా] సహాయం దానికి కొంత కారణం కా[ని] అంతా కాదు. ప్రధానమయిన కారణం [ఆ] దేశంలో ఉన్న జనమే. వారిలో ఎందరు సంగీ[త] విద్వాంసులు, ఎందరు డాక్టరులు, ఎందర[ు] ఇంజనీరులు, ఎందరు భౌతిక శాస్త్రజ్ఞులు



వీళ్లంతా కలిసి తమ దేశాభివృద్ధికి ఎంత కృషి చేస్తున్నారు! మానసికంగా సజీవంగా ఉన్నవారే తమ దేశాన్ని ఉద్ధరించగలరు. యూరోపు సుమారు 500 ఏళ్లపాటు వికాసం చెందుతూ వచ్చిందంటే ఇదే కారణం. బ్రిటన్ ఈ దేశాన్ని పాలిస్తున్న కాలంలో అక్కడ వాళ్ల జాతీయ వికాసం ఎంత గొప్పగా జరిగింది! ఎందరు రచయితలు, ఎందరు శాస్త్రవేత్తలు, ఎందరు కళాకారులు! బ్రిటన్‌లో వీరి ఉత్సాహం పెల్లుబికినన్నాళ్లు ఆ దేశం వెలిగిపోయింది. ఇది తగ్గగానే ఇంగ్లాండు వైభవమూ క్షీణించి పోయింది. భావాలే శక్తిని సృష్టించగలవు. ఆరోగ్యం కూడా అంతబాగాలేని ఒక పత్రికా రచయిత సృష్టించినదేకద 'కమ్యూనిజమ్' అన్న భావం! ఆయన భావాలే సోవియెట్ యూనియన్‌ని నేటి స్థితికి తీసుకురాగలిగాయి. ఆ భావాలు ఇప్పుడు అంత ఉజ్వలంగా లేవు కనుకనే సోవియెట్ యూనియన్ బలం మునుపటి లాగ పెరగటంలేదు.

భారతదేశానికి స్వంత భావాలు ఎక్కువ అయితే ఈ దేశమూ అభివృద్ధి చెందగలదు. ఇతరుల భావాలమీద ఎంతకాలం జీవించగలము? మన ప్రణాళికలు బ్రిటిషు ఫాబియన్ సొసయిటీ వద్ద అరువు తీసుకున్న భావాలమీద నిర్మాణం అయినవి. ప్రొఫెసర్ మహలనోబిస్ నమూనాలు సోవియెట్ యూనియన్ వద్ద అరువు పుచ్చుకున్నవి. మన ఆర్థికవేత్తలు కీన్స్‌ని వల్లిస్తారు— వాళ్ల గురువుల దగ్గిర నేర్చుకున్న మాటలవి. మన షుంపీటర్‌లూ, మన ఫ్రీడ్‌మాన్‌లూ ఏరీ? మన ఐన్‌స్టీన్‌లూ, క్రిక్‌లూ ఏరీ? మన ఆర్వెల్‌లూ, సార్త్రెలూ ఎక్కడ? అరువు తీసుకున్న ఆలోచనలమీద ఎంతకాలం జీవించగలము? గత 30 సంవత్సరాలుగా మనదంతా అరువే. తూర్పు – పడమరల నుంచి భావాలూ; తూర్పు – పడమరల నుంచి ధనమూ; సాంకేతిక విజ్ఞానం పడమర నుంచి, ప్రణాళికలు తూర్పు నుంచి తీసుకున్నాము. అసలు మన పార్లమెంటరీ పద్ధతి ప్రజాస్వామ్యం కూడా అరువు తీసుకున్న సంస్థేకదా? [పాశ్చాత్యుల దగ్గిర నుంచి దీనిని అరువు తీసుకున్నాము!] ఇక మిగిలినది ఏమిటి? ఆహారమూ, సంగీతమూనా? లేకపోతే ఇవీ కల్తీ అవుతున్నాయా? మన దుస్తులు వేసుకోము. ఇంకెవరివో వేసుకుంటాము. మరి రెండో రకం దేశంకాక ఏమికాగలము! లోపల నుంచి 'ఊపు' రాకపోతే లోపల 'ఆత్మ' లేదనిపిస్తూ ఉంటుంది!

"మనదేశంలో పేదవారి శాతం ఎంత?" అని లెక్కలు వేస్తూ ఉంటారు మన ఆర్థిక నిపుణులు. కీన్స్ ఇలాంటి లెక్కలని అంతగా పట్టించుకునేవాడే కాదు. ఆర్థికంగా పేదవారు కంటికి కొట్టవచ్చేట్లు కనపడతారు. భావ దారిద్ర్యంతో బాధపడే మనస్థితి చాలా హీనంగా ఉంటోంది.



# ప్రేమే దైవం! మానవసేవే ఆరాధన!



మతాల మర్మమంతా ధర్మమేనని చాటిచెప్పే ధ్వజస్తంభం

పుట్టపర్తి సత్యసాయిబాబాను గురించి తెలియని వారు చాల అరుదుగా ఉంటారు. ఆయనకు 'గ్లోబల్ రెప్యుటేషన్' ఉన్నమాట నిజం! బాబాలమీద హేతువాదులని పిలవబడే వారికి సదభిప్రాయం ఉన్నట్లు కనిపించదు. అదే విధంగా సత్యసాయిబాబాను కూడ వారు విమర్శిస్తూ ఉంటారు.

సత్యసాయిబాబా దేవుడు కాదని వారంటారు. అసలు పుట్టపర్తి బాబాని దేవుడని ఎవరన్నారు? అవధూత జ్ఞానమున్న వారికి బాబాల బోధనలక్కరలేదు. పామరులకు గురి కుదరడానికి బాబా దేవుడనే భ్రాంతి కలగాలి. అంత మాత్రమే! ఏసుక్రీస్తు దేవుడా? మహమ్మదు దేవుడా? బుద్ధుడు దేవుడా? జైనుడు దేవుడా? శంకరుడు దేవుడా? చైతన్యుడు దేవుడా? కాని వారిని దేవుళ్ల కన్నా ఎక్కువగా ఆరాధించే వాళ్లున్నారు. ఈ ఆరాధన పరమభక్తి ప్రేరేపితం కావచ్చు లేదా మూఢ భక్తే కావచ్చు. దీనికి ఆ ప్రవక్తలు ఏమి చేస్తారు?

మహిమలు చూపడం, మహత్మ్యాలు చూపడం ఒక గారడీవాడు కూడ చేయగలడని అంటారు. ఈ ప్రవక్తలు చూపే మహిమలకు గారడీ పనులకు భేదం ఎలాంటిదో అందరికీ తెలుసు! క్షీరనీర న్యాయాన్ని పరమహంస మాత్రమే అందించగలుగుతుంది కాని తెల్లగా ఉన్నంత మాత్రాన ఒక బకం అందించగలుగుతుందా? రూపానికి,నటనకు అందని భావ సంస్కారాన్ని ఎవరికి వారే చిత్తైకాగ్రతతో సాధించాలి కాని, ఎవరో చెబితే నేర్చుకొనేదా అది!

శ్రీసాయి తాను దేవుడని కాని, దేవుని ప్రతిరూపాన్నని కాని ఎక్కడా ఏ సందర్భంలోనూ చెప్పినట్లు ఏ విధమైన ఆధారమూ లేదు. తన్ను మూఢంగా విశ్వసించే భక్తులతో కూడ ఆమాట అతడు చెప్పినట్లు ఎవరూ అనడంలేదు. ఇంతకూ సాయిబాబా దేమతం? మానవత్వం అతని మతం! మమత అతని కులం! నీతి అతని జాతి! ప్రేమ దైవమని ప్రబోధిస్తాడాయన. మానవసేవే ఆరాధనని తెలియజెపుతాడాయన. ఒక బౌద్ధుడు అతని సమక్షంలో గౌతముని స్మరించుకోవచ్చు. ఒక కిరస్తానీయుడు బైబిల్ పఠనం చేయవచ్చు. అల్లా యంచు ఒక ముస్లిము ఎలుగెత్తవచ్చు. రామ కృష్ణ గోవింద యంచు ఒక హిందువు భక్తిగీత మాలపించవచ్చు. అంతేకాని సాయిబాబాయే దేవుడని భావించనక్కరలేదు. ఇంతటి సంస్కారం మన వైదిక ధర్మ ప్రభావమని నా అభిమతం. స్వోత్కర్ష అని అనుకోకుంటే ప్రపంచంలో ఏ మత ప్రవక్త వివరించలేని భావ సంస్కారంలో మనవాభిగమనాన్ని నిర్దిష్టంగా స్పష్టంగా తెలియజెప్పింది మన సనాతన ధర్మమే! ఈ ధర్మాన్నే సత్యసాయి ప్రవచిస్తున్నాడు. అతడు ప్రత్యేకంగా చెబుతున్నదేమీ లేదు!

ప్రేమ దైవమంటే ఎవరు కాదంటారు? మానవసేవే భగవదారాధన అంటే తప్పేమి ఉన్నది? సత్యము, జ్ఞానము, భక్తి, ఏకాగ్రత ఉత్తమ జీవనానికి సోపానాలని అంటే అందులో ఆశ్చర్యమేముంది? స్వార్థం అనర్థానికి మూలహేతువని దానిని వదలించుకొంటేనే తప్ప జీవితం చరితార్థం కాదని అంటే సందేహమేమున్నది? బాబా చెబుతున్నదిదే! పూర్ణచంద్ర ఆడిటోరియమ్‌లో ప్రతిధ్వనించేవి ఆ సుభాషితాలే! అన్ని మతాల సంకేతాలతో అక్కడ వెలసిన ధ్వజస్తంబం తెలియజేస్తున్న రహస్యం కూడ అదే!

సముద్రంలా మనస్సుంటే నీలి మమత ఉంటుంది. సెలయేరులా మనస్సుంటే అర్థంకాని ఆరాటముంటుంది. అలా అని మనస్సు పాచి పట్టిన పుష్కరిణిలా ఉంటే అర్థం కాని మౌఢ్యమలుము కొంటుంది. దోనె నీటిలా మనస్సు నిష్కల్మషంగా స్వచ్ఛంగా ఉంటే ఎంతటి పనినైనా సునాయాసంగా నిర్వహించవచ్చును. ఎంత చక్కగా ఉంది వివరణ! ఏకాగ్రత అవసరమని శాస్త్రాలు కూడ గీ పెడుతున్నాయి కదా! సైకోట్రానిక్స్‌లో ఉన్నదేమిటి?

ఎంతో సులువుగా జీవిత ధర్మాన్ని ప్రబోధించే బాబా ప్రశంసార్హుడే!

— డా. గుమ్మనూరు రమేష్‌బాబు

ఎన్నో ధార్మికోపన్యాసాలు కొనసాగే పూర్ణచంద్ర ఆడిటోరియం



# రివాల్వింగ్ ఛెయిర్

సారె రామమోహనరావు

ఆఫీసు కాంపౌండులోకి అడుగు పెట్టి గబగబా నడుచుకుంటూ టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లోకి ప్రవేశించాడు సూపర్‌వైజర్ బాబూరావు.

"గుడ్‌మార్నింగ్ సర్!" అంటూ బోర్డుల మీద కూర్చున్న నలుగురు ఆపరేటర్లు ఒకేసారి విష్ చేశారు.

"గుడ్‌మార్నింగ్" అని తను కూడ విష్ చేసి తన టేబుల్ దగ్గరకు నడిచాడు.

ఎదురుగా చెక్క కుర్చీ దర్శనమిచ్చింది.

ఆ కుర్చీని చూడగానే నీరు కారిపోయాడు బాబూరావు.

రోజూ తను ఆ చెక్క కుర్చీలో కూర్చోలేక పోతున్నాడు. ఎక్స్ఛేంజ్ రూమ్‌కంతటికి ఆ చెక్క కుర్చీ దిష్టిబొమ్మలా వుంటుంది. తను పన్నెండు మంది టెలిఫోన్ ఆపరేటర్లకు సూపర్‌వైజరు. అంటే తను వాళ్లందరి మీద పెద్ద. కాబట్టి తనకి రివాల్వింగ్ ఛెయిర్ వుంటే బాగుంటుంది. ఆఫీసర్ని ఎప్పటి నుంచో అడగాలని అనుకుంటున్నాడు. ఈరోజు ఆఫీసరు అనంతాన్ని తనకి రివాల్వింగ్ ఛెయిర్ కావాలని తప్పకుండా అడగాలి.

నిస్పృత్తవగా కుర్చీలో కూలబడ్డాడు బాబూరావు.

ఆపరేటర్లందరూ డ్యూటీకి వచ్చారోలేదో అటెండెన్స్ రిజిస్టర్ చూసి, తను కూడ సైన్ చేశాడు. మస్టర్ రిపోర్ట్ తయారుచేసి ఆఫీసరు అనంతం సైన్ కోసం కారిడార్‌లోకి వచ్చాడు. నెమ్మదిగా నడుచుకుంటూ గదిలోకి ప్రవేశించాడు.

ఆఫీసరు అనంతం టేబుల్ ముందు రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని ఓ చేత్తో ఫైల్స్ చూస్తూ, మరో చేత్తో విలాసంగా సిగరెట్ కాల్చుకుంటున్నాడు.

తన రాకని తెలియబరుస్తూ చిన్నగా దగ్గాడు బాబూరావు.

అనంతం తలెత్తి చూశాడు.

బాబూరావు వినయంగా మస్టర్ రిపోర్టు ఆయన టేబుల్ మీద వుంచాడు.

అనంతం మస్టర్ రిపోర్టు మీద సైన్ చేసి మళ్లీ ఫైల్స్ చూడటంలో మునిగిపోయాడు.

కొంచెంసేపయాక అనంతం ఎందుకో తల పైకెత్తాడు.

బాబూరావు ఇంకా అక్కడే నిలబడి వున్నాడు.

"ఏమిటోయ్ బాబూరావ్? ఏం కావాలి?" అని అడిగాడు అనంతం.

"తమరికో విషయం మనవి చెయ్యాలను కొంటున్నాను." అన్నాడు బాబూరావు ఎంతో వినయంగా.

"ఏమిటది."

"ఏమీలేదు సార్! నాదో చిన్న కోరిక. ఎప్పటినుంచో మిమ్మల్ని అడగాలనుకుంటున్నాను. ఎక్స్ఛేంజ్‌లోని చెక్క కుర్చీలో కూర్చోవటం నాకు చాలా ఇబ్బందిగా వుంటోంది సార్! ఎక్కువ సేపు ఆ కుర్చీలో కూర్చోలేకపోతున్నాను... కాస్త పెద్ద వయసువాడినికదా. కూర్చున్నచోట ఒత్తుకుపోయి నొప్పిపెడుతోంది" అన్నాడు బాబూరావు.

"అయితే ఏమిటంటావ్ ?" అన్నాడు అనంతం.

"తమరు తలుచుకుంటే ఎలాంటి పనైనా చేయించగలరు. కాబట్టి ఆ చెక్కకుర్చీ స్థానంలో మీరు నాకొక రివాల్వింగ్ ఛెయిర్ వేయిస్తే..." అంటూ ఆగిపోయాడు బాబూరావు.

"బాబూరావ్! ఏమిటి సంగతి? ఈ మధ్య నీ కోరికలు ఆకాశాన్ని అంటుతున్నట్లున్నాయి. పోనీ కావాలంటే నువ్వొచ్చి నా సీట్లో కూర్చో. నేను పోయి నీ కుర్చీలో కూర్చుంటాను" అన్నాడు అనంతం.

"అదికాదు సార్!.." అంటూ బాబూరావు ఏదో అనబోయాడు.

"ఇక నువ్వేమీ మాట్లాడనవసరంలేదు. యు కెన్ గో" అన్నాడు అనంతం.

బాబూరావు బాధగా వెనుదిరిగాడు.

విచారంగా వచ్చి తన చెక్క కుర్చీలో కూర్చున్నాడు.

ఆఫీసరు అనంతం తనని అనుగ్రహించలేదు. ఇక తనకి రివాల్వింగ్ ఛెయిర్ వచ్చే ప్రాప్తం లేదు అని అనుకున్నాడు.

అంతలోనే —

అతనికి మరో ఆలోచన వచ్చింది. "అవును. అలాచేస్తే..." అని అనుకున్నాడు.

ఆఫీసరు అనంతం భార్య ఆండాళ్ళమ్మది తన వూరే. ఆవిడ తనకి బాగా తెలుసుకూడాను. వాళ్ళ ఇంటికి తను ఎప్పుడు వెళ్ళినా ఆవిడ తన యోగక్షేమాలు అడిగి తెలుసుకుంటూ వుంటుంది. ఒకసారి ఆవిడ తనతో అంది కూడాను — "బాబూరావ్! అయ్యగారివల్ల నీకేదైనా పని జరక్కపోతే నాకుచెప్పు. నేను అయ్యేలా చేస్తాను" అని.

వెంటనే ఈ విషయాన్ని అమ్మగారి చెవిన వేసి ఆవిడ ద్వారా రివాల్వింగ్ ఛెయిర్ సాధిద్దామనుకున్నాడు.

సాయంకాలం నాలుగయింది.

సెకెండ్ షిఫ్ట్ ఎక్కిన ఆపరేటర్లలో సీనియర్ ఆపరేటర్‌కి చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పి, నైట్ డ్యూటీ సీనియర్ ఆపరేటర్‌కి కూడ ఆ జాగ్రత్తలు పాస్ చెయ్యమని చెప్పి, రిజిస్టర్‌లో ఆఫ్ డ్యూటీ సంతకం చేసి బయట పడ్డాడు బాబూరావు.

అమ్మగారి దగ్గరకు వెలుతున్నప్పుడు వట్టి చేతులతో వెళితే బాగుండదని దారిలో పెద్ద పనసపండొకటి కొన్నాడు. దానిని మొయ్యలేక మొయ్యలేక మోస్తూ అమ్మగారి దగ్గరకు బయలుదేరాడు.

బాబూరావుని — ముఖ్యంగా అతని చేతిలోని పనసపండుని చూడగానే ఆండాళ్ళమ్మగారి ముఖం చాటంత అయింది.

బాబూరావు నమస్కారం చేసి పనసపండుని ఆమెకి అందించాడు. పనివాడిని పిలిచి ఆమె ఆ పనసపండుని లోపల పెట్టమంది. పైకి మాత్రం "ఇప్పుడిలాంటివన్నీ ఎందుకు బాబూరావ్ ?" అంటూ మొహమాటం నటించింది.

"ఫరవాలేదండీ ! ఏదో నా తృప్తికోసం" అంటూ చేతులు నలుపుకుంటూ నిలబడ్డాడు బాబూరావు.

ఎవరైనా చేతిలో ఏదైనా వస్తువుతో ఇంటికి వచ్చారంటే తనతో ఏదో పని పడ్డదని ఇట్టే గ్రహించేయగలదిట్ట ఆండాళ్ళమ్మగారు.

"అయ్యగారు నిన్ను ఆఫీసులో బాగానే చూసుకుంటున్నారా ?" అడిగిందామె.

"ఏదో తమరి దయవల్ల బాగానే చూసు కుంటున్నారండీ ! కాని ..." అంటూ నసిగాడు, అసలు విషయం చెప్పబోతున్నట్లు.

"ఆఁ ఏమిటి ? ఏమయింది ?" అడిగారు ఆండాళ్ళమ్మగారు.

''అహ ! ఏమీలేదండి ! ఎక్స్పెంట్‌లోని నాకు రోజా చెక్కకుర్చీలో కూర్చోవడం ఇబ్బందిగా వుంటోందండీ ! అందులోనూ నా వయసు కాస్త పెద్దదేమో... కూర్చున్నచోట ఒత్తుకుపోయి నొప్పిపెడుతోందండీ ! అందుకని నాకో రివాల్వింగ్ ఛెయిర్ వేయించమని అయ్యగార్ని అడిగానండీ ! కాని, అయ్యగారు కోప్పడ్డారు. ఇదండమ్మా సంగతి'' వివరించాడు బాబూరావు.

''ఆపరేటర్లకి నువ్వు హెడ్డువికదూ !'' అడిగారు ఆండాళ్ళమ్మగారు ఏదో ఆలోచిస్తూ.

''అవునండి'' అన్నాడు బాబూరావు.

''అయితే నీకు తప్పకుండా రివాల్వింగ్ ఛెయిర్ వుండి తీరాల్సిందే!'' అన్నారు ఆండాళ్ళమ్మగారు.

''అవునండీ'' అన్నాడు బాబూరావు మరింత వినయంగా.

''నేనీ విషయం అయ్యగారితో మాట్లాడతాను. త్వరలోనే నీకు రివాల్వింగ్ ఛెయిర్ వచ్చే ఏర్పాటు చేస్తాను'' భరోసా ఇచ్చారు ఆండాళ్ళమ్మగారు.

బాబూరావు మనసులో ఎంతో సంతోషించాడు. తను తీసుకొచ్చిన పనసపండు ఫలితం వృధా పోలేదని అనుకున్నాడు.

''ఏదో తమరి దయండీ అమ్మగారూ ! వస్తాను'' అని ఆండాళ్ళమ్మగారి దగ్గర సెలవు తీసుకున్నాడు బాబూరావు.

* * *

రెండు రోజులు గడిచాయి.

ఆ రోజు వుదయమే బాబూరావు డ్యూటీకి వస్తూ తన టేబుల్ ముందు రివాల్వింగ్ ఛెయిర్ వుండడం చూసి ఎగిరి గంతేసినంత పని చేశాడు.

దర్జాగా ఛెయిర్‌లో కూర్చున్నాడు. పైకి, క్రిందికి ఎగిరాడు. వెనక్కి, ముందుకి వూగాడు. ఛెయిర్‌లో గుండ్రంగా రెండుసార్లు తిరిగాడు. ఆ ఛెయిర్‌లో కూర్చునేసరికి ఆఫీసరు అనంతంలా ఫీలయ్యాడు.



# రివాల్వింగ్ ఛెయిర్

ఒక్కసారిగా పొజిషన్స్‌లో కూర్చుని పని చేసుకుంటున్న ఆపరేటర్ల మీద ఆఫీసర్‌లా తన సూపర్‌వైజర్ దర్పాన్ని ప్రదర్శించాలనిపించింది. అవకాశం కోసం ఆపరేటర్లని పరిశీలించసాగాడు.

ఇంతలో బోర్డు మీద ఫస్ట్ పొజిషన్‌లో కూర్చున్న కామేశం అనే ఆపరేటర్ లేచి—

"సర్ ! సూపర్‌వైజర్‌గారూ ! కాస్త బాత్‌రూమ్‌కి వెళ్లొస్తాను" అన్నాడు.

"ఏమిటోయ్ కామేశం ? రోజుకు నువ్వెన్నిసార్లు బాత్‌రూమ్‌కి వెళ్తావు ? మనిషన్నాక కాస్త బుద్ధుండాలయ్యా ! డ్యూటీకి వచ్చి ఇంకా గంటన్నా కాలేదు అప్పుడే నీకు బాత్‌రూమా ? వెళ్లొద్దు కూర్చో" అన్నాడు.

పాపం ! కామేశం బిక్కముఖంతో మళ్లీ తన పొజిషన్‌లో కూర్చున్నాడు.

బాబూరావు రివాల్వింగ్ ఛెయిర్‌లో వెనక్కీ ముందుకీ వూగుతూ ఆపరేటర్ల వర్కుని గమనించసాగాడు.

సుబ్బారావు అనే ఓ ఆపరేటరు ఒక సివిల్ కాల్‌ని అటెండ్ చేస్తూ 'గుడ్‌మార్నింగ్ సర్' అని అడ్రస్ చెయ్యలేదు.

బాబూరావుకి అవకాశం దొరికింది.

"సుబ్బారావ్ నీకెన్నిసార్లు చెప్పాను— కాల్ అటెండ్ అయ్యేముందు 'గుడ్‌మార్నింగ్ సర్' అని అడ్రస్ చెయ్యాలని. అలా అడ్రస్ చెయ్యాలని నీకు తెలీదు ? నీ ఐదేళ్ల సర్వీసులోను నువ్వు నేర్చుకున్నది ఇదేనా ? ఈసారి కొత్త అటెండ్ చేస్తున్నప్పుడు 'గుడ్‌మార్నింగ్ సర్' అని అడ్రస్ చెయ్యకపోతే నీకు వార్నింగ్ లెటర్ ఇప్పిస్తాను. జాగ్రత్త !" అంటూ ఫైరైపోయాడు.

సుబ్బారావు ముఖం మాడిపోయింది.

ఓ అరగంట గడిచింది.

బాబూరావు రివాల్వింగ్ ఛెయిర్‌లో వెనక్కీ, ముందుకీ వూగుతూ ఆపరేటర్లని గమనించ సాగాడు.

ఇంతలో లేడీ ఆపరేటర్ సరళ తన పొజిషన్ లోంచి లేచి—

"సూపర్‌వైజర్‌గారూ ! కాస్త ఎడ్మిన్ సెక్షన్‌కి వెళ్లి జి. పి. ఎఫ్‌లోను ఫారాలు తెచ్చుకుంటాను" అంది.

"ఏమ్మా వెళ్ళడానికి నీకిదేనా సమయం. ఇప్పుడు వెళ్ళడానికి వీల్లేదు. నీ డ్యూటీ అయిపోయాక వెళ్ళు" కరకుగా అన్నాడు బాబూరావు.

సరళ ముఖం కందగడ్డలా అయింది.

బాబూరావు రివాల్వింగ్ ఛెయిర్‌యొక్క ఆనందాన్ని అనుభూతిని అనుభవిస్తూ వెనక్కీ ముందుకీ వూగుతూనే వున్నాడు. ఛాన్స్ దొరికితే ఆపరేటర్ల మీద ఫైరైపోవాలని చూస్తూనే వున్నాడు.

మరో గంట గడిచింది.

సీనియర్ ఆపరేటర్ తాతారావు తన పొజిషన్‌లోంచి లేచి —

"బాబూరావుగారూ ! కాస్త టీ తాగి వస్తాను" అన్నాడు.

బాబూరావు సీరియస్‌గా ముఖం పెట్టాడు.

"నువ్వు రోజూ టీ టైమ్‌లో టీ తాగుతూనే వున్నావుకదా! మళ్ళీ మధ్యలో టీ అంటూ బోర్డు మీద నుంచి లేచిపోతావేం ? నువ్వు సీనియర్ ఆపరేటర్‌వి. నాకు కాస్త బుద్ధుండాలయ్యా ! నిన్ను చూసి మిగతా ఆపరేటర్లుకూడ ఇలాగే చేస్తారని నువ్వు తెలుసుకోవాలి. ఇక ముందు నువ్వు మాటి మాటికీ టీకి వెళ్ళే ప్రవర్తన మార్చుకోకపోతే నిన్ను ఆఫీసర్‌గారి దగ్గరకు తీసుకువెళ్ళాల్సి వుంటుంది. జాగ్రత్త!" అన్నాడు.

## తేడా

కొద్దిగా మచ్చ వుందని
సిగ్గుపడి చంద్రుడు
అప్పుడప్పుడైనా
మబ్బు చాటున మోము
దాచుకుంటాడు —
ఈ మనిషి మాత్రం
తప్పులు చేస్తూనే
తల ఎత్తుకు తిరుగుతాడు !

— వలి

తాతారావు ముఖంలో రంగులు మారాయి.

బాబూరావు రివాల్వింగ్ ఛెయిర్‌లో గాలిలో తేలిపోసాగాడు.

"ఆహా ! ఏమి తన భాగ్యం ! రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చునేసరికి తనకి ఎంత హుందా వచ్చింది ? ఈ రివాల్వింగ్ ఛెయిర్‌లో ఆఫీసరు అనంతంకంటే కూడ చక్కగా ఆపరేటర్లని కంట్రోల్ చేయగలుగుతున్నాడు. అలా చేయ గలుగుతున్నాడు అంటే, ఈ ఘనత తనదికాదు. రివాల్వింగ్ ఛెయిర్‌ది. రివాల్వింగ్ ఛెయిరూ ! నీకు నా జోహారు !" అని మనసులోనే దానికి జోహార్లు అర్పించుకున్నాడు బాబూరావు.

మధ్యాహ్నం రెండయింది.

రిలీవర్స్ రాగానే మార్నింగ్ షిఫ్ట్ ఆపరేటర్లయిన తాతారావు, సుబ్బారావు, కామేశం, సరళ డ్యూటీ దిగి ఆఫీసు బయటకు వచ్చారు. ఈ రోజు బాబూరావు ప్రవర్తన విపరీతంగా వుందని ఒకరి నొకరు అనుకున్నారు. కాల్స్ ఎలా అటెండ్ చేసినా ఎప్పుడూ ఏమీ అనని బాబూరావు, కారణం అడక్కుండానే ఎప్పుడువడితే అప్పుడు బయటికి వెళ్ళడానికి పర్మిషన్లిచ్చే బాబూరావు ఈ రోజు అలా విపరీతంగా ప్రవర్తించడానికి కారణమేమిటో అని చాలాసేపు ఆలోచించారు. ఆలోచించగా ఆలోచించగా ఆ నలుగురికీ అది 'రివాల్వింగ్ ఛెయిర్ మహిమ' అని అర్థమయింది. అంతే ! వాళ్ళల్లో వాళ్ళు చాలాసేపు ఏదో గుసగుసలాడుకుని ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

* * *

మర్నాడు ఎనిమిదింటికి బాబూరావు టెలిఫోన్ ఎక్స్చేంజ్‌లోకి అడుగుపెట్టాడు. రోజూ అతని డ్యూటీ వుదయం ఎనిమిదినుంచి సాయంకాలం నాలుగుదాకా వుంటుంది. అతనిది జనరల్ షిఫ్ట్.

తాతారావు, కామేశం, సుబ్బారావు, సరళ బోర్డు మీద వాళ్ళ పొజిషన్స్‌లో కూర్చుని కామ్‌గా పని చేసుకుంటున్నారు.

బాబూరావు ఠీవిగా అడుగులు వేస్తూ రివాల్వింగ్ ఛెయిర్‌ని సమీపించాడు. దర్జాగా కూర్చోబోతు ఛెయిర్‌ని ఒకసారి చూశాడు.

అంతే !

"నా రివాల్వింగ్ ఛెయిర్" అంటూ చిన్నగా గావుకేక పెట్టాడు.

రివాల్వింగ్ ఛెయిర్‌ని పూర్తిగా పనికి రాకుండా ఎవరో బ్లేడుతో కోసేసి స్పాంజి అంతా బయటికి లాగేశారు.

పాపం ! బాబూరావుకి దుఃఖం ముంచు కొచ్చింది.

"ఈ ఛెయిర్‌ని ఎవరిలా చేశారు ?" సీనియర్ ఆపరేటర్ తాతారావుని కోపంగా అడిగాడు.

"ఏమో సార్ ! మాకు తెలీదండీ ! మేము వుదయం ఆరు గంటలకి డ్యూటీ ఎక్కేసరికే అలా వుంది" అని చెప్పాడు తాతారావు.

బాబూరావు లబోదిబోమంటూ ఆఫీసరు అనంతం రూములోకి పరిగెట్టాడు.

అనంతానికి ఏడుపుముఖంతో రివాల్వింగ్ ఛెయిర్‌ని ఎవరో కోసేశారని చెప్పాడు.

అనంతం బాబూరావు వైపు కోపంగా చూశాడు.

"ఇలాంటి పనులు చేస్తారనే ఆఫీసుల్లో మీలాంటివాళ్ళకి ఎవరూ రివాల్వింగ్ ఛెయిర్లు వేయించరు. నీ సీటులో మరొక రివాల్వింగ్ ఛెయిర్ వేయించడమంటూ ఇక వుండదు. ఈ రోజునుంచి నువ్వు ఎప్పటిలా చెక్కకుర్చీలోనే కూర్చో. మళ్ళీ రికమండేషన్ కోసం అమ్మగారి దగ్గరకు పరిగెట్టావంటే ఈసారి నీకు ఛార్జిషీటు ఇస్తాను" సీరియస్‌గా అని తన పనిలో మునిగి పోయాడు అనంతం.

పాపం ! సూపర్‌వైజర్ బాబూరావు కన్నీళ్ళ పర్యంతంతో వెనుదిరిగాడు. 

# వారఫలం

27-1-1984 శుక్రవారం మొదలు 2-2-1984 గురువారం వరకు

♈ మేషం: పెద్ద ఉద్యోగంలో ఉన్న వారు ఈవారం అనుకొనని విధాన అధిక లాభం పొందనున్నారు. ఇతరుల చేత చిక్కిన ధనం శ్రమిస్తే ఈ సమయంలో వసూలు కాగలదు. నూతనాంశాలు గ్రహించే సమయం కూడ. స్త్రీలకు వస్తు సేకరణ, కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి.

♉ వృషభం: శ్రమిస్తే మంచి లాభం పొందనున్నారు. అది వ్యాపార రీత్యా గాని, వ్యవహార రీత్యా గాని సంక్రమింపనున్నది. ఆదాయం వెనుక టి వారాల కన్నా ఎక్కువగానే పొందనున్నారు. స్త్రీలకు: కళా రంగాన భవం అభివృద్ధి దాయకం. ధనలాభ మున్నది.

♊ మిధునం: వ్యాపారం చేసే లాగైతే, అధిక శ్రద్ధ అవసరం. ఏదో విధంగా చిక్కులు తటస్థించే లాగున్నది, గ్రహించి మెలగండి. 'చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొంటే లాభం?' ఉద్యోగ యత్నాలు సఫలం కాగలవని గ్రహించాలి. స్త్రీలకు. ఆభరణ సేకరణ, వృత్తి యందు పెంపు సమకూడుట నిశ్చయం.

♋ కర్కాటకం: అవకాశవాదులు, స్తోత్ర ప్రియులు, కాని వారు దాపునకు రాగలరు. జాగ్రత్తగా సంచరించండి. అప్పు చేయ వలసిన పరిస్థితి వస్తుంది, ఆలోచించి మెలగండి. వ్యాపారంలో సుముఖత కనిపిస్తుంది. విలువ గల వస్తువులు కొనుగోలు చేయనున్నారు. స్త్రీలకు: అధికార వర్గం మూలాన, పెద్దల వలన ధనవంతుల వలన చాలమందికి మేలేదో జరుగగలదు.

♌ సింహం: అనుకోకుండా మిత్రులు గాని, బంధువులు గాని యింటికి రాగలరు. మంచిగా మాట్లాడినా తగాదాలు రానున్నవి, జాగ్రత్త! ఎదురు చూడని ఖర్చులు కూడా బాగా తగులుతవి. కోర్టు వ్యవహారాలు అనవసరంగా తటస్థింపనున్నవి. భూములు కొనుగోలు చేయగల ప్రయత్నాలు మానుకోండి. స్త్రీలకు: దూరపు ప్రయాణాలు తటస్థించటం, వృత్తిలో అభి కనిపిస్తుంది.

♍ కన్య: అధికమైన ఓర్పుతో పనులు సాగించ వలసిన దినం. వ్యాపారంలో అభివృద్ధి కరమైన మార్పులు రానున్నవి. దైవ కార్యాచరణకు చాలమందికి అవకాశమున్నది. ఉద్యోగం కొరకు చేసే ప్రయత్నాలు ఫలవంతం కాగలవు. స్త్రీలకు: దూర బంధువులు యింటికి రానున్నారు. అధిక వ్యయానికి అవకాశమున్నది, జాగ్రత్త!

♎ తుల: ఏదో ఒక వ్యవహారంలో విజయ సాధనకు యత్నిస్తారు. సఫలత అందుకోనున్నారు. ఉద్రేకంతో ఒకటి రెండు పనులు చెడగొట్టుకోనున్నారు ధర్మ కార్యాచరణకు చాలమందికి అవకాశమున్నది. స్త్రీలకు: ధనాదాయం గలవారం.

♏ వృశ్చికం: ఇతరుల సహాయం లేకుండా కొన్ని పనులు నెరవేరనున్నాయి. అర్థికస్తోమత్తు ఏర్పడ గలవారం. కుటుంబంలో తగాదా తంటాలు లేకుండా చూచుకోవాలి. దావా తగాదాలుంటే వానిని శాంతంగా సర్దుబాటు చేసికోండి. ధారాళంగా ఖర్చు చేయ వలసిన కార్యక్రమం కూడా ఉంటుంది. స్త్రీలకు: నూతనాంశాలు గ్రహించటం, శుభ కార్యం అనుకూలం అని గ్రహించాలి.

♐ ధనుస్సు: బంధువులు యింటికి రా గలరనీ, వారితో శుభ సంప్రతింపులు ఉండనున్నవనీ, వృత్తిలో ఉద్యోగాలలో పెంపు కనిపించగలదని, వారాంతంలో గ్రహింపనున్నారు, వ్యాపారంలో భాగస్థులుగా ఉన్న వారి నుండి యిబ్బంది కలుగవచ్చు. స్త్రీలకు: వాహనం కొనుగోలు చేయుటం సాధ్యం, కొందరు ఉద్యోగ రీత్యా 'ట్రాన్స్ఫరు' ఆశింపవచ్చు.

♑ మకరం: అవసరాలకు సరిపడునంత డబ్బు చేతికి అందుతుంది. సుఖ శాంతులకు లోపం లేని వారం. వ్యతిరేక వర్గం మీకు చిక్కులు కల్పింపనున్నారు. చాల కాలంగా అమరని వస్తువుల కొరకు యత్నించటం వ్యర్థమని గ్రహించ గలరు. ఆస్తి సమకూర్చుకోవటం కొందరకు సాధ్యం. స్త్రీలకు: నూతన బంధుత్వం సమకూడటం ప్రజ్ఞకు తగిన అవకాశాలు లభించ గలవు.

♒ కుంభం: ఈవారం చాల విజయవంతమైన వారం. ఒకానొక విషయంలో ఈ వారం చాల మందికి అవకాశాలు ఏర్పడ గలవు. ఒకానొక విషయం మీ ఓర్పును పరీక్షింపనున్నది. డబ్బు ధారాళంగా ఖర్చు చేయ వలసిన పరిస్థితులుంటాయి. స్త్రీలకు: విలువ గల వస్తువులు సేకరించు కొనుటకు అవకాశం గలవారం.

♓ మీనం: మీ యిబ్బందులకు తోడు, యితరులకు సహాయం చేయ వలసి రావచ్చు. పంచాయతీ విధానం ఒకానొక విషయంలో మీకు మేలు చేకూరుతుంది. వృత్తి వ్యాపారాల విషయమా? గత వారం కన్నా బాగుంటాయని గ్రహించాలి. సంఘగౌరవానికి లోపం రాదు. స్త్రీలకు: శ్రమ లేకుండా వృత్తి, ఉద్యోగాలు సాగిపోతాయి, గ్రహించండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం



సుప్రసిద్ధ సినిమా విమర్శకురాలు, రచయిత్రి లోట్టె ఐస్నర్ తమ 87వ ఏట పారిస్‌లో మరణించారు. ఈమె హిట్లర్ బారి నుండి తప్పించుకోవటానికి జర్మనీని 1933లో వదిలి వెళ్ళిపోయారు. నాజీలు పాత జర్మనీ సినిమాలని నాశనం చెయ్యకుండా ఎంతో కృషి చేశారు ఈమె ...



ఈ అమ్మాయి వయసు 16 మాత్రమే. పశ్చిమ జర్మనీలోని స్టాడె అనే నగరంలో స్కూలులో విద్యార్థిని. ఈమె పశ్చిమ టర్కీ నుంచి జర్మనీకి వలస వచ్చిన కుటుంబానికి చెందిన అమ్మాయి. ఇటీవలే ఈమె స్కూలు విద్యార్థు(ర్థిను)ల ప్రతినిధిగా ఒక మునిసిపాలిటీ సంస్థకి ఎన్నిక అయింది. ఈమె పేరు ఎమిన్ ఫిరాట్ ...



వెండీ డి లానీ లండన్‌లో పోలీసు ఉద్యోగం చేసే వనితలలో ఒకరు. ఈవిడ వివాహితుడయిన ఒక పురుష సహోద్యోగితో కలిసి 'పెట్రోల్' (గస్తీ) డ్యూటీ చెయ్యరాదని పయి అధికారులు అన్నారుట. ఇది ఆడవారికే అవమానకరమయిన విచక్షణ — అని ఆవిడ ఆరోపిస్తున్నారు ..



హిందీనటి పర్వీన్ బాబీ స్విట్జర్లాండ్‌లోని గస్టాడ్‌లో మానసిక సంబంధమైన అస్వస్థతకి చికిత్స పొందుతున్నట్లు వినికిడి. ఆమెతో చిత్రాలని నిర్మిస్తున్న 19 మంది నిర్మాతలకి కూడా తాను దేశం వదలి వెళ్తున్నట్లు చెప్పలేదట. వారిలో చాలా మంది పర్వీన్‌కి బదులు జీనత్ అమన్‌ని పెట్టి తమ చిత్రాలు పూర్తి చేసుకుంటున్నారట ...

సీరియల్

# యక్షగానం

స్వర్గీయ

## శ్రీమతి మాదిరెడ్డి సులోచన

"అంకుల్ ! నేనొకసారి నీలిమతో మాట్లాడ తాను, అభ్యంతరమా !''

"నాకేం అభ్యంతరం...'' అన్నాడు యెటో చూస్తూ

"నీలూ !'' అతను చేరవేసిన తలుపులు తోసాడు.

ఆమె జవాబుగా వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఛ... ఛ . ఏడుస్తారా ! ఇంతకంటే దారుణమైన పరిస్థితి ఎదురుకోలేదూ !'' అన్నాడు మృదువుగా ఆమె భుజం తట్టి

"పరిస్థితికి బాధ కాదు నాన్న ..ఎందుకిలా మారిపోయాడో అర్థం కావటంలేదు...'' అన్నది.

అతను డ్రస్సింగ్ టేబుల్ వెతికి, దూది తీసుకుని, ఆమె నుదురు తుడిచాడు.

"అయోడిన్ లేదా ?''

"కింది అరలో ఉంది చూడు ''

క్రింది అరలోని అయోడిన్ తీసుకుని, గాయంపై గుద్దాడు. ఏది అంటూ తల పట్టు కున్నాడు

"అమ్మో ! . '' కెవ్వుమన్నది అతను అదిరిపడ్డాడు

(గత పంచిక తరువాయి)

" ఏది చూడనియ్యి ...'' తల నిండా బొప్పిలే, వీపుమీద బెల్ట్ దెబ్బలు అట్టకట్టాయి.

"ఏమిటి నీలూ !''

"నా దురదృష్టం ఆదిత్యా ! ''

"నీలూ !'' అతని కళ్లు చమర్చాయి.

" నేను బండ బారి పోయాను '' అన్నది బాధగా నుదురు రాసుకుంటూ.

"నువ్వు, నువ్విక్కడ ఒక్క క్షణం ఉండ వద్దు నీలూ. వెళ్దాం పద.''

"ఎక్కడికి ? ''

"నా వెంట పద. నా భార్యగా...'' అన్నాడు ఆవేశంగా,

"ఇద్దరికి తికానా లేదు.''

"కొందరు అన్ని హంగులతో జీవితం ప్రారంభిస్తారు. మరి కొందరు ఏమీ లేకనే ప్రారంభిస్తారు. మనమలాగే ప్రారంభిద్దాం నీలూ !''

"ఆదిత్యా !'' ఆవేశంగా అంటున్న అతని హృదయంలో తలదాచుకుందామె.

"చాలు ఆదిత్యా! హాయిగా చచ్చిపోవటానికీ ధైర్యం చాలు.''

"ధైర్యం కాదు... నిజం నీలూ నా జీవితంలో రెండేరెండు కోరికలు మిగిలాయి.నిమ్న వాదాన్ని చేసుకుని యెవరూ కనీ విని ఎరుగ నంతగా ప్రేమించాలి, నీకు సుఖమయ జీవితం అందించాలి. ఇక, నాపై నేరం మోపిన వారిని పట్టుకుని వారి అంతు తేల్చాలి'' అన్నాడు.

ఆమె 'సాధ్యమా' అన్నట్టు చూచింది.

"పాతికేళ్లు ఒక ఎత్తు ! ఈ సంవత్సరం ఒక ఎత్తు నీలూ ! చాలినంత అనుభవం గడించాను'' అన్నాడు.

అతని భుజంపై తల వాల్చింది.

"ఆదిత్యా ! ఏమో ! నేను మాత్రం వయసుకంటే ముందుగా పండిపోయాను, నాకు... నాకు విశ్రాంతి కావాలి.''

అతనామె నుదురు చుంబించాడు. మెల్లగా నుదుట పడిన వెంట్రుకలు సవరించాడు.

"మన పెళ్లి విషయము డాక్టరుగారితో చెప్పాలి నీలూ.''

"నా గురించి ఆలోచించే స్థితిలో లేను అలసిపోయాను. ఏం చేసినా నీ ఇష్టం.'' అతను ఆమె పరిస్థితి అర్థం చేసుకున్నాడు నందనరావే కాదు, ఆమెకూడా చిక్కి శల్యమయ్యింది.

"నీలూ . నువ్వు ధైర్యంగా ఉండాలి.''

ఆమె జవాబుగా అతని అరచేయి చుంబించింది

"వస్తాను '' అతను బయటికి వచ్చేసరికి నందనరావ్ గంభీరంగా ఉన్నాడు అనవసరంగా తగాదా ఎందుకని అతనితో పెళ్లి విషయం చెప్పాలనే నిశ్చయించాడు.

"అంకుల్ !''

"చెప్పు ''

"నేను, నీలు పెళ్లి చేసుకుందాం అనుకున్నాం.''

**జరిగిన కథ — 13 :** ఇక తను ఆడే నాటకాన్ని విరమించాలని ప్రయత్నిస్తుంటుంది ముకుందాదేవి ముకుందాదేవి ఇంట్లో దోపిడి జరుగుతుంది. తను ఇంతకాలం నాటకం ఆడి భక్తుల ముడుపుల ద్వారా సంపాదించిన సొమ్మును కొంచెం కూడా మిగల్చకుండా ఎత్తుకుపోతారు. ముకుందాదేవి ఆదిత్యపై నేరం మోపి అరెస్ట్ చేయిస్తుంది. చైనులూ, రాయుడూ కలసి ఈ దొంగతనం చేశారని నీలిమ చెప్పినా వినదు. ఆ ఆస్తి కోసమే కాచుక్కూచున్న సావిత్రి తన కొడుకుతో వెళ్లిపోతుంది. డాక్టర్ శివాజి ఇచ్చిన పేపర్ ప్రకటన చూసి అప్లికేషన్ పెట్టిన నీలిమను ఆహ్వానిస్తాడు శివాజి. వారిరువురూ మాట్లాడుకొన్న తర్వాత గుళ్లో పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకొంటారు. ఆదిత్య కేసు వాయిదా పడుతుంది. నీలిమ తనకు పుట్టిన బిడ్డే అని ముకుందాదేవి ద్వారా తెల్సుకొంటాడు శివాజి ఆదిత్యను బెయిల్ మీద విడిపిస్తాడు. నీలిమను ఆదిత్యకిచ్చి పెళ్లి చేయాలని నిర్ణయించుకొంటాడు. ఆదిత్య, నీలిమలకు తను విద్యార్థి జీవితంలో అనుభవించిన కష్టాలను చెపుతాడు డాక్టరు శివాజి యువ తరంగిణి ప్రోగ్రాం నుంచి ఇంటికి వచ్చిన నీలిమ శివాజికి, తన తల్లికి గల అక్రమ సంబంధాన్ని తెలుసుకొని తల్లిని అసహ్యించుకొంటుంది. తన ఉనికినే అసహ్యించుకొనే తండ్రి ప్రవర్తనకు బాధపడుతుంది నీలిమ నీలిమను నందనరావు అనరాని మాటలంటుండగా ఆదిత్య వింటాడు.



''ఆదిత్యా! ఒక మాట చెప్పేదా! నువ్వు, నువ్వు మనిషిగా బ్రతకాలంటే పెళ్లి విషయం మరిచిపో. కాదు ఈ నీలిమను మరిచిపో. నీకు తగినవారెవరు దొరికినా చేసుకో ''

''అంకుల్ !''

''అవును ఆదిత్యా ! వీళ్లంతా వ్యభిచారులు. నిలకడ లేనివారు. నా మాట విను. కమలాకర్ కొడుకువు నీకు ద్రోహం చెయ్యలేను.''

''కన్నకూతురు ..''

''ఈ ప్రపంచంలో నా కూతురు, నా వస్తువు అనుకోవటం మూర్ఖత్వం.''

''ప్రతి తండ్రి ఇలాంటి వేదాంతం చెబితే. '' నవ్వాడు ఆదిత్య

''తండ్రి. .'' అతని ముఖం కండరాలు బిగుసుకున్నాయి

''చూడండి, కారణాలు ఏవయినా కావచ్చు, ఆమె తల్లిని మీరు అసహ్యించుకుంటున్నారు. ఆమె జీవితం నాశనము చెయ్యాలని చూడకండి. యెవరు ఏమనుకున్నా, నీలును నేను పెళ్లి చేసుకుంటాను.'' అన్నాడు ఆవేశంగా.

''అయితే. నీ ఇష్టం...'' అన్నాడు పళ్లు పట, పట కొరుకుతూ. ఆదిత్య చర, చర బయటికి వచ్చాడు

## 22

ఆదిత్య, నీలిమల పెళ్లి నిరాడంబరంగా, నర్సింగ్‌హోమ్ పైనున్న కాన్ఫరెన్స్ హాలులో జరిగింది. 'నాకు ఆశీర్వదించే హక్కు ఉన్నదో, లేదో, పెళ్లికి వస్తే నీకు, నీలుకు వ్యధే. నీ ఇష్టప్రకారం పెళ్లి చెయ్యి శివా'' అంటూ ఉత్తరం రాసింది ముకుందాదేవి

శివాజీరావు నిట్టూర్చాడు

నీలిమను తీసుకువెళ్లి చీరలుకొనుకొమ్మంటే ఆమె మొహమాటపడుతూ నాలుగయిదే తీసుకున్నది ఆదిత్యకు కొనిచ్చాడు ఒక బంగారు గొలుసు, ఉంగరం కొన్నాడు గాజులు ఆమె కున్నాయి

జిల్లా కలెక్టరు ఆనాటి పెళ్లికి ఆధ్వర్యం వహించాడు.

ఇద్దరిచేత ప్రమాణాలు చేయించాడు. నీలిమ మనసు మహాసాగర మయినా, ఆమె ఆహూతుల కోసం, నవ్వుతూ కూర్చుంది. తనకు, తల్లి, తండ్రి ఉండికూడా అనాథగా పెళ్లి చేసుకుంటున్నది

మెల్లగా, యెవరికి కనిపించకుండా, ఆదిత్య ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆ చేతి స్పర్శలో ఎన్నో ఓదార్పులు నేనున్నానని ధైర్యం చెప్పినట్టు అనిపించింది. అంతకుముందే శివాజి పట్ల అసహ్యం పెంచుకోవద్దని అర్థించాడు. అందుకే చిరునవ్వుతో కూర్చుంది

ఆమె తెల్ల పట్టుచీరకు మరూన్ రంగు అంచు ఉన్నది కట్టుకున్నది తెల్లజాకెట్టు వేసుకున్నది. అంతకంటే తెల్లని మల్లెలు ముడుచుకున్నది నిరాడంబరంగా, అందంగా కనిపించింది

ఆదిత్య కూడా తెల్లని చొక్కా, ప్యాంటు వేసుకున్నాడు ఇద్దరూ ఒకరికోసమే ఒకరు పుట్టినట్టున్నారు.

పెళ్లి సందర్భంగా మాట్లాడిన వారంతా అదే మాట అన్నారు. ఆ తరువాత శివాజి ఏర్పాటు చేసిన విందులో పాల్గొన్నారు

''మా ఇంట్లో మీరుంటే ఇంట్లోని నిశ్శబ్దం పారిపోతుంది మా ఇంటికే రండి'' అని పార్థసారథి ఆహ్వానించాడు నీలిమ నిరాకరించ బోయింది.

''మీరంతగా చెప్పాలా తాతయ్యా.'' అన్నాడు ఆదిత్య

శివాజి ఇంట్లో పై గదులు వారికిచ్చారు.

''వెళ్లి ఒక్కసారి అంకుల్‌కు నమస్కారం చేసివద్దాం నీలూ !''

''ఆయన తిరస్కారం ఈ శుభసందర్భంలో భరించలేను: సారీ .'' అన్నది అతను మాట్లాడలేదు. భుజం తట్టాడు

''దాంపత్య జీవితం మొదలుపెట్టిన రోజునే నీ మాట తిరస్కరించటం బాధగా ఉన్నది.''

''నీ అభిప్రాయం చెప్పావు నాకయితే యెవరూ లేరు ''

''నాకు అందరూ ఉన్నారు తల్లివి, తండ్రివి, తోబుట్టువి అన్నీ నువ్వే కొందరి జీవితాలు అందరిలా హాయిగా గడిచిపోవు మనము, మనకోసం బ్రతుకుదాం'' అన్నది. ఆమె తల్లి తండ్రుల పట్ల ఎంత నిరసన పెంచుకుందో అర్థం అయింది.

మారు మాట్లాడక ఆమె వీపు నిమిరాడు తన సామాన్లు ఆ గదిలో సర్దింది నీలిమ

''రేపు సర్దుకోవచ్చు రా నీలూ ''

''నాకు వస్తువులు చిందర వందరగా, చీదరగా ఉంటే నచ్చదు'' అన్నది జరీచీర విప్పేసి, మామూలు చీర కట్టుకుంది.

''అదేమిటి సినిమాల్లో మొదటిరాత్రి ఖరీదయిన చీర, మంచం నిండా పూలు



ఉంటాయి'' అతను డ్రస్సు మార్చుకుని, లుంగీ కట్టుకున్నాడు.

''సినిమాలో ఉండే డ్యూయెట్లు, పట్టు చీరలు నిజజీవితంలో ఉన్నాయా !'' నవ్వుతూ వచ్చి అతని ప్రక్కన కూర్చుంది.

''నన్ను అన్నావు. నువ్వేమిటీ అవతారం ! హిందీ సినిమా అయితే జరీ బుటాల శేర్వాని చుడీదారీ పైజామా వేసుకుంటారు. తెలుగు సినిమాలో అయితే లాల్చీ, ధోవతి . '' నవ్వింది.

''అవునవును లడ్లు, పండ్లుకూడా కావాలి. పాట పాడుదామా !''

''పాపం ! పార్థసారథి తాతయ్య పోలీసులకు ఫోన్ చెయ్యాలి. నిదుర వస్తున్నది'' ఆమె దిండు పైకి వాలిపోయింది. ఆమె ప్రక్కనే ఒరిగాడు. ఆమెకు చేరువగా వెళ్లాలంటే కాస్త భయంగా, కాస్త గమ్మత్తుగా ఉంది.

## నీటిలో ఈదే కారు !

పశ్చిమ జర్మనీలోని వోల్క్స్‌వేజన్ కంపెనీ ప్రయోగాత్మకంగా నీటిలో ఈదగల కారును తయారుచేసింది. ఈ కారును రాబిట్ అని అంటారు. ఆస్ట్రియా లోని ఊర్దర్‌శీ సరస్సులో జరిగిన విన్యాసాలలో ఈ కారు సునాయాసంగా నీటిపై తేలింది. నీటిపై ప్రయాణానికి ఈ కారుకు వాటర్ స్కూలను అమర్చారు రోడ్లమీద పరుగెత్తటానికి మామూలుగా చక్రాలు వున్నాయి

''నీలూ ''

''ఊఁ. '' ఆమె చనువుగా అతని చేతిపై తల ఆన్చింది.

మెల్లగా అతని చేయి ఆమె చుట్టూ పడింది ఆమె కళ్లు మూసుకుంది. ఆమె కళ్లు చుంబించాడు.

రాత్రి పన్నెండు గంటలు దాటి ఉంటాయి అతని చేతులలో హాయిగా నిదురపోతున్న నీలిమకు తలుపు శబ్దం వినిపించింది.

యెవరబ్బా అనుకుంటూ, ఆదిత్య చేయి తొలగించింది.

మళ్లీ కాస్త గట్టిగా కొట్టారు

''ఆఁ వస్తున్నాను'' లైటు వేసి, గబగబ చీర కట్టుకుని, వెంట్రుకలు సవరించు కున్నది వెళ్లి తలుపు తీసింది

పార్థసారథి నిల్చున్నాడు.

''నీలూ ! మీ నాన్నగారు స్లీపింగ్ టాబ్లెట్లు మింగారట. పరిస్థితి ప్రమాదంగా ఉందని నర్సింగ్‌హోమ్‌లో అద్దెకున్నవారు చేర్చారు. శివాజి వెళ్లాడు మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యొద్దనుకున్నాను కాని, ఇప్పుడే శివాజి ఫోన్ చేసాడు అతని పరిస్థితి అంతబాగా లేదుట అన్నాడు.

''ఓ మై గాడ్ !'' అన్నది. ఆమె గదిలోకి తొంగి చూచింది ఆదిత్య హాయిగా, ఈ ప్రపంచంతో సంబంధం లేనట్టు నిదుర పోతున్నాడు

''నేను ఆస్పత్రికి వెళ్తాను. ఆదిత్యను లేపకు తాతయ్యా. ''

'' నేను డ్రావ్ చేస్తాను పదమ్మా '' అన్నాడు.

ఆమె మెల్లగా తలుపులు చేరవేసి, క్రిందికి వచ్చింది. పార్థసారథి ఆమెను నర్సింగ్ హోమ్‌కు తీసుకు వెళ్లాడు

అప్పుడే శివాజి యెదురు వచ్చాడు అతని ముఖం విచారంగా ఉంది

''సారీ నీలూ! ఛాన్సెస్ ఆర్ వెరి పూర్...'' అన్నాడు.

ఆమె వెళ్లి 'నాన్నా' అంటూ అతని హృదయంపై తల పెట్టింది. ఆమె చిన్నప్పుడు అతను లాలించిన తీరు, అన్నీ గుర్తుకు వచ్చాయి

''ఈ ఉత్తరం పోలీసులకు ఇవ్వు'' అన్నా రమ్మా అంటూ పనివాడు ఉత్తరం ఇచ్చాడు

''నా మరణం నాకు శాంతి నివ్వాలని నేను నిదుర మాత్రలు మింగాను. నా మరణానికి ఎవరూ బాధ్యులు కారు. నా ఒంటరితనం, నా అసహాయత నన్ను కృంగదీసింది నా కెవరూ లేరు . ''

''నాన్నా ! . .యెందుకు యెందుకు నాపై ఇంత నిర్దయ పెంచుకున్నావు !'' బావురు మన్నది నీలిమ కళ్లు తుడుచుకుని మళ్లీ చదివింది

''నా భార్యఉన్నా ఆమె నాతో విడిపోయింది ఆమెకు, నాకు యెలాంటి సంబంధం లేదు నాకు మిగిలిన ఆస్తి, ఈ మేడ ఒక్కటే. అది ప్రభుత్వం స్వాధీన పరుచుకుని, తల్లి, తండ్రి లేని అనాథలకు ఆశ్రమమో, బిడ్డలు లేని నాలాంటి వృద్ధులకో సంక్షేమ హాస్టలుగా మార్చాలని నా కోరిక. ''

నీలిమ హృదయంలో చెయ్యి పెట్టి కెలికి నట్టయింది.

'బిడ్డలు లేని' అన్నచోట ఆమె దృష్టి నిలిచిపోయింది. నా భార్య అన్న మనిషికి నా బిడ్డ అని చెప్పకోలేక పోయాడా! అంతా తన దురదృష్టం దానికి ఏం చేయలేదు.

''నా ఇష్టపూర్వకంగా రాసి, లాయర్ దగ్గర వీలునామా ఉంచాను ఈ ఆఖరు దశలో నన్ను కనిపెట్టుకున్న పని వారిద్దరికి నా బట్టలు, నా గడియారం ఇస్తే, నా ఆత్మ సంతో షిస్తుంది ''

మరిచిపోయి కూడా తన పేరెత్తలేదు తండ్రి. యెంత కాఠిన్యము ? చాలాసేపు అలా కూర్చుండి పోయింది.

''ఏం రాసిం(డమ్మా !'' పని కుర్రవాడు అడిగాడు

''తన చావుకు తనే కారణం అని రాసారు'' అన్నది కళ్ళు తుడుచుకుని

''పాపం ! ఆరుగంటల దాక కబుర్లు చెప్పారమ్మా, ఆరుగంటలకు పడుకుంటానని గదిలోకి తీసుకు వెళ్ళమన్నారు తీసుకు వెళ్ళాక, ఈ ఉత్తరం ఇచ్చారు నేను పోలీసుల కెందుకయ్యా అంటు అడగలేదు. పక్కింట్లో టి వి చూడాలనుకున్నాను తొందరగ పన్లు ముగించుకుందామని వెళ్ళిపోయాను''

''మాత్రలు మింగినట్లు ఎప్పుడు చూచావ్ ?''

''టి. వి చూచి వచ్చి, భోజనం చేసి పడుకున్నాను. రోజూ తెల్లవారేసరికి రెండుసార్లు లేపేవారు ఆ సమయానికి టక్కున మేల్కొన్నాను వెళ్లి అయ్యా అయ్యా ! అని యెంత పిలిచినా పలుకలేదు. భయం వేసింది వెళ్ళి (శ్రీవత్సమ్మను లేపాను ఆమె, ఆమె పెనిమిటి వచ్చి చూచారు. పక్కనే నిదురగోలీల ఖాళీసీసా ఉందట టాక్సీకి పంపారు అందరం కల్సి నర్సింగ్ హోమ్‌కు తెచ్చినాము'' అన్నాడు.

''ఎంతపని చేసావు నాన్నా !'' మరోసారి అతని హృదయంపై తలవాల్చింది చాలా బలహీనంగా కొట్టుకుంటుంది గుండె. అతని జేబులో కాగితాలు, ఒత్తుగా ఆమె చెంపకు గుచ్చుకున్నాయి ఆమె లేచి కళ్ళు ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి

''చి॥సౌ॥ నీలిమకు'' అన్న కవరు కనిపించింది.

# య క్ష గా న ం

తండ్రి తన పేరెత్తలేదని బాధపడింది. కాని, తనకు ఉత్తరం రాసేడా ! అతను ఎడమ చేత్తో కెలికినట్టు రాస్తాడు. ఆ అక్షరాలు కుదురుగా ఉన్నాయి. ఆదుర్దాగా విప్పిచూచింది

అది తల్లి ఉత్తరం అమ్మ నాకు ఉత్తరం రాసిందా ! తిప్పి చూసింది నలిగి శిధిలావస్థలో ఉన్నది ఆత్రంగా విప్పింది

చి॥ నీలూకి

అమ్మ

ఆశీస్సులు.

నీలూ ! నువ్వు నన్ను డాక్టరంకుల్‌తో చూచి నాపై అంతులేని అసహ్యం పెంచుకున్నావని తెలుసు. నీలూ ! శాంతంగా, నీ తల్లి చరిత్రగాకాక, ఒక స్త్రీ గాథ, బాధా పూరితమైన వ్యథతో కూడిన గాథ అర్థం చేసుకో మొదట పూర్తిగా చదువు ఆ తరువాత నీకు అసహ్యం వేస్తే నేనేం చేయలేను మనిషిగా నీ ముందు తిరుగలేక దూరంగా వెళ్లిపోతున్నాను నాకక్కడ సుఖశాంతులు దొరుకుతాయని కాదు నీకు ముఖం చూపించలేక.

నీలూ ! నేనొక మామూలు కుటుంబంలో పుట్టి, పడరాని పాట్లు పడ్డాను నాకున్న ధనం,వరం, ఏదయినా అనుకో, అందమే ఆ అందాన్ని చూచి, శ్రీ నందనరావుగారు నన్ను పెళ్లి చేసుకున్నారు వారు బాగా ఆస్తిపరులకి, ఏకయిక పుత్రుడు వారికి పిల్లలంటే ఆపేక్ష వారి తలిదండ్రులకి ఒక్కరే కొడుకు కాని ఆ కొడుక్కు చాలామంది పిల్లలు పుట్టాలని వారి ఆకాంక్ష. నేనుకూడా వారి అభీష్టం నెరవేరితే చాలు అనుకున్నాను. ఎందుకంటే కట్నకానుకలు, లాంఛనాలు లేవని నిరాశపడేవారికి జవాబు చెప్పాలనుకున్నాను దురదృష్టం అక్కడా నా వెంటే ఉన్నది రెండు సంవత్సరాలు తిరిగినా పిల్లలు కాలేదు

నందనరావుగారి తల్లి వ్రతాలు, పూజలు, ఉపవాసాలు మొదలుపెట్టించింది కనిపించిన మంత్రగాడికల్లా చూపింది వారికి డబ్బు కావాలి ఏదో ఒకటి చెప్పేవారు

అమ్మాయిని శని పీడిస్తున్నదని కొందరు చెప్పారు

కాదు గర్భదోషం ఉందని యజ్ఞం చేయించారు అరటి ముఖం చూచి, స్నానం చేసింది అరటి చెట్టుకు ప్రదక్షిణం చేయాలన్నారు

మర్రి చెట్టుకు ప్రదక్షిణచేసి, మర్రిపాలు త్రాగాలన్నారు

నా కాపురం నిలబెట్టుకోవాలని ఏది చెబితే అది చేసాను లాభం కనిపించలేదు స్త్రీ కాపురం నిలబెట్టుకోవటానికిన్నిపాట్లు పడాలా— అని జీవితంపై విరక్తి కల్గింది రెండు మూడేళ్లు గడిచేసరికి నందనరావులో కూడా మార్పు కన్పించింది అతను జీవితంలో ఏదో మార్పు కోరుకుంటున్నారు

''ముకుందా ! ఆ ఎదురింటి పిల్లను చూడు. '' అనేవారు వారి చిలిపి చేష్టలకు మైమరిచిపోయేవారు అప్పుడే నా చిన్నప్పటి స్నేహితురాలు సావిత్రి వచ్చింది దాని కొడుక్కు అనారోగ్యం, బాగుచేయించుకోవాలని మునింట్లో ఉన్నది వారం రోజులలో నా అవస్త గమనించింది

''అన్నయ్యగారూ ఈ మంత్ర తంత్రాలకంటే డాక్టరును చూస్తే మంచిదేమో '' అని సలహా ఇచ్చింది ఇద్దరం డాక్టరును చూచాం

''ఇతనికి పిల్లలు పుట్టరు '' అని చెప్పాడు డాక్టరు

''ఒరేయ్ అబ్బాయి ! తనను తన్ని తరిమే స్వామని, నీ భార్య వేసిన ఎత్తురా ఇది !'' అని నందనరావు తల్లి ఇంత ఎత్తున ఎగిరిపడింది

డాక్టరు నాపట్ల సానుభూతిగా మాట్లాడటం వారికి నచ్చలేదు

''నేను పిల్లలకోసం మళ్లీ పెళ్లి చేసుకున్నా నిన్ను అన్యాయం చేయను '' అని హామీ ఇచ్చారు

నాకు తలపై పిడుగు పడినట్లు అయింది ఏం చేయలేకపోయాను నందనరావు నా మాట నమ్మరని అర్థం అయింది.

అప్పుడే సావిత్రి రమ్మని రాసింది ఆయనకు వ్యాపారం పని కూడా ఉందట

ఇద్దరం బొంబాయి వెళ్లేము అక్కడ పరీక్ష జరిగింది అదే రిపోర్ట్ వచ్చింది

## సంక్రాంతి కన్య

గుడి గోపురము వోలె గొనబునించెను బంతి
మంతు కెక్కినది చేమంతిపూవు

చంద్రకాంతముల హాసము వెన్నెలల మించె
బొగడలు ముద్దుగా మూతి ముడిచె

నల్ల గల్వలు మించె మొల్లమ్ముగా పూచి
లొద్దుగ లందాల దిద్దికొనియె

ముల్లుగోరింట సొంపుల దిద్దుకొనె కొల్ల
కొల్లలుగా నందికొండటంచు

రథగమన వేళ క్రొత్త హోరంగు చూపు
నంశుమంతుని పూజింప నాస్తతోడ

పళ్లెరము నింపుకొనుచును పరిథవిల్లు
కాంతి విరజిమ్మ కన్య సంక్రాంతి వేళ

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి







"మీ ఆయనకు పిల్లలు అయ్యే యోగం లేదమ్మా నీకే జబ్బు లేదు.'' అని భారత దేశంలో ఒకరుగా ఎన్నతగిన గైనకాలజిస్టు చెప్పింది. కాని ఆయన నమ్మరు. సావిత్రి ఏదో చేసిందని అనుమానిస్తారు.

"మీకంతగా కావాలని ఉంటే ఇతర పద్ధతు లున్నాయి మనము పవిత్రంగా పూజించే భారతంలోనే కుంతి పుత్రుల కోసం " అంటూ సలహా ఇచ్చింది

దిగాలుగా బయటికి వచ్చాను హిపోక్రసీతో బ్రతుకుతున్న సమాజం ఇది కుంతి కన్యగా తల్లి అయిందని ఇప్పటికి సానుభూతి చూపుతారు అదే కలియుగంలో ఒక కన్య తల్లి అయితే కాకుల్లా పొడుస్తారు కుంతీదేవి యమధర్మరాజు, ఇంద్రుడు లాంటి పెద్దల నాశ్రయించిన ఘట్టం ఎంత రసవత్తరంగా వర్ణిస్తారో, ఈనాడు స్త్రీ అలాంటి పని చేస్తే అంత దారుణంగా వెలి వేస్తారు

ఇంటికి రాగానే నందనరావు అమ్మగారు —

"రిపోర్ట్ ఏది !" అన్నారు

" రేపు రమ్మన్నారు " అప్రయత్నంగా అబద్ధం ఆడాను

"సరే ! నువ్వు నీ చెక్ అప్ పూర్తిచేసుకో నేను మారిషస్ వెళ్ళాల్సిన పని ఉంది." అని ఆయన బిజినెస్ టూర్ వెళ్ళిపోయారు

సావిత్రి సలహా ఇచ్చింది

"అసలు విషయం చెప్పినా నమ్మరు డాక్టరమ్మ అన్న మాటలు విన్నావుగా'' అన్నది నాకు మతిపోయింది

"నన్నేం చేయమంటావు ? ఆయన తప్ప నాకు పరిచయస్తులు లేరు " అన్నాను

"పరిచయస్తులతో ప్రమాదం " అన్నది ఆలోచిస్తూ,

"ఏం చేయాలి ?" అన్నాను

"నువ్వు త్వరగా తయారవ్వు ఒకచోటికి వెళ్దాం." అన్నది. తయారయ్యాను ఇద్దరం టాక్సీలో ఒక బంగళాకు వెళ్లాం.

"ముకుందా ! ఈవిడ రూబీ అని సోషియల్ వర్కర్ ఒకటి రెండు బ్యూటి క్లినిక్‌లు నడుపు తుంది.'' అని పరిచయం చేసింది.

నా చరిత్ర అంతా రూబీకి చెప్పింది రూబీ చిన్నగా మందహాసం చేసింది

"మీ సమస్యలు నాకు చెప్పి నిశ్చింతగా ఉండండి సాయంత్రం ఇక్కడికి రా పరాయి పురుషుడు అని భయపడవద్దు, మన దేశంలో స్త్రీ పురుషులు పరిచయమైయ్యేదే మొదటి సమాగంలో " అన్నది ఇంగ్లీషులో. నేను జంకుతూ చూచాను

"నో ఫియర్ అయామ్ హియర్ ఇక్కడ మదమెక్కి మగువలను పాడుచేసే యువకు లుండరు రోగాలతో రొప్పులతో నీరసించిన దుష్టులూ ఉండరు అంతా జెంట్స్ బ్రతుకు తెరువు కోసం, తమ చదువుల కోసం పరస్పరం సహకరించేవారే ఉంటారు'' అన్నది ఆమెకో అయిదు వందలు అడ్వాన్స్‌గా ఇచ్చి బయటికి వచ్చేము నాకెందుకో భయం వేసింది

"చూడు ముకుందా ! నువ్వు డబ్బుకాశించి, ఒళ్ళు కొవ్వి ఈ పని చేయలేదు, అవసరం నీ భర్త నీ మాట నమ్మడు పురుషాహంకారంతో మళ్లీ పెళ్లి చేసుకుంటాడు అప్పుడు ఒరిగేది ఏమీ ఉండదు నిత్యం కీచులాటలు, పోట్లాటలు, గొడవలు నువ్వు కాస్త ధైర్యం చెయ్యి '' అన్నది సావిత్రి చెయ్యక తప్పదు గతం తలుచుకుంటే ఆ జీవితం ఎవరికి వద్దు అనిపిస్తుంది

రూబీ చెప్పినట్టుగా ఆమె ఇంటికి వెళ్లాను ఆమె ఓ గదిలోకి తీసుకువెళ్లింది అక్కడ ఓ యువకుడు కూర్చుని చదువుకుంటున్నాడు

"మిస్టర్ చక్రీ ! ఈమె మిసెస్ దేవీప్రియ ఈ సంవత్సరం నీ చదువు ఖర్చు భరిస్తుంది పిల్లలు లేరు. భర్త మళ్లీ పెళ్లి చేసుకుంటానని బెదిరిస్తున్నాడట. దేవీ మీరు మాట్లాడు తుండండి వస్తాను.'' అని వెళ్లిపోయింది, ఆమె రాదని తెలుసు.

"టీ తీసుకుంటారా !" అతని కంఠంలోని ఆప్యాయతకు కరిగిపోయాను. నాలో సన్నగా వణుకు ప్రారంభం అయింది నాకంటే చిన్న కుర్రాడు

"వద్దు " అన్నాను మొహమాటంగా.

"ఇది టీ టైమ్ కాదని తెలుసు అయినా పాలు, కూల్ డ్రింక్ ఇచ్చే స్తోమతలేదు'' అన్నాడు మా సంభాషణ హిందీలో జరిగింది

నా ఉనికి యెవరికి తెలియరాదని కాబోలు, రూబీ నన్ను దేవిప్రియగా పరిచయం చేసింది అనుకున్నాను

అరగంటలో ఎంతో సన్నిహితులం అయినట్టు, మా అనుబంధం ఈ ఒక్క జన్మది కాదన్నట్టు అనిపించింది

అతనితో వారంరోజులు గడిపాను అతడిని విడిచి వెళ్లాలంటే నాకు మనస్కరించలేదు

"రైలు ప్రయాణంలో ఎందరో సన్నిహితు లవుతారు వారందరిని గుర్తుపెట్టు కుంటామా !" అని సావిత్రి మందలించింది

నందనరావుగారు మారిషస్ టూర్‌నుండి తిరిగి వచ్చారు

"అన్నయ్యగారూ ! మీకు పిల్లలు అవుతారట కాని మీరు రాకపోయినా, అప్ప డప్పుడు ముకుంద డాక్టరు దగ్గరకు రావలసి ఉంటుంది'' అన్నది, సావిత్రి

"అలాగే వస్తుందమ్మా !" అన్నారు

**(ఇంకా ఉంది)**

# నిర్బంధ విద్యా విధాన మేర్పడాలి

## దేశ భాషలలో విద్యలను బోధించాలి

### డా॥ ఏ. లక్ష్మణస్వామి మొదలియారుగారి స్నాతకోపన్యాసము

గత 30– తేది సాయంకాలము మదరాసు నగరమున గవర్నరును, ఛాన్సలరు నగు ఎర్స్కిను ప్రభువు అధ్యక్షత క్రింద మదరాసు విశ్వవిద్యాలయ పట్ట ప్రదాన సభ జరిగినది ఇప్పుడు మదరాసు వైద్య కళాశాలకు ఆక్టింగు ప్రిన్సిపాలుగా నున్న రావు బహద్దూర్ ఏ. లక్ష్మణ స్వామి మొదల్యారుగారు (బి. ఏ, ఎం జి ఎఫ్ సి. వో జి) ఆ సభలో ఇట్లుపన్యసించిరి —

విశ్వవిద్యాలయములో నిరుపయోగమైన వారి ఆక్షేపణలు వెనుకటికంటె నిపుడు చాల అధికమైనవి విద్యార్థులలో పనిలేనివారి సంఖ్య చాల అధికమగుచుండుటయే దీనిని ముఖ్యకారణము పరిస్థితి మిక్కిలి శోచనీయముగా నున్నది కాన ఈ ఆక్షేపణలు సహేతుకములే యగును గాని దీని నివారించుటకు తగిన సాధనములను వీ రెవ్వరును సూచించుటలేదు. విశ్వవిద్యాలయముల వలన దేశములో పనిలేని వారిసంఖ్య మరింత పెరిగిపోవుటతప్ప మరెట్టి లాభమును కలుగులేదని గూడ కొందరతివాదులు వ్రాసియున్నారు ఈ విశ్వవిద్యాలయములో చదివినవారు చాలమంది న్యాయవాదులుగను సయింటిస్టులుగను పరిపాల కులుగను రాజకీయ నాయకులుగను చాల విఖ్యాతిని బడసిరి. దీనివలన భారతజాతికి నూతనాశయ ములును నూతనవాంఛలును నూతన భాగములును లభించినవి అట్టి విశ్వవిద్యాలయమును అతి నీచముగా తిరస్కరించుట ఉచితము కాదు ఇటులనుటవలన విశ్వవిద్యాలయ విధానములో మార్పు అవసరములేదని నేను తెలుపుటలేదు. నూతన పరిస్థితులవలన నూతన దృక్పథమేర్ప డుట దానివలన నూతన పద్ధతు లవసర మగును. విశ్వవిద్యాలయమునకు దేశమునందలి ప్రజా జీవితముతో సంబంధము లేకపోయినచో అది క్రమక్రమముగ అచేతనస్థితికి పాలగుట నిశ్చయము

ఉన్నతవిధులు బోధించు పద్ధతిలో గొప్ప మార్పు జరగక తప్పదుగాన ధీమంతులందరును దీనినిగూర్చి చాల శ్రద్ధగా నాలోచించుచునే యున్నారు నిరుద్యోగము విద్యావిధాన పునర్నిర్మా ణము వీటిని రెంటినిగూడ నేకకాలముననే పరిష్క రింపవలెను వీటి కట్టి దృఢ సంబంధమున్నది విద్యార్థులలో నిరుద్యోగులసంఖ్య చాల అధిక మగుటవలన ప్రజల దుస్థితిగూడ చాల అధిక



మైనది అందువలన దేశమునందు సహింప నలవిగాని దుస్థితి యేర్పడినది మొదటినుండియు విద్య నేర్చినవారందరును ప్రభుత్వోద్యోగులుగా నుండవలెననియే కోరుచుండిరి ఇపుడు మన దురదృష్టము వలన ప్రభుత్వోద్యోగముల నిచ్చుటకు వయపరిమితి యను యితర షరతులను యేర్పడినవి 21–25 సంవత్సరముల మధ్య వయసు వారికి మాత్రమే ప్రభుత్వోద్యోగము లియ్యబడుచుండుటచే చాల మంది గత్యంతరము లేక కళాశాలలో చేరవలసివచ్చుచున్నది ఇపుడు ఆయా ప్రభుత్వశాఖలలో ఉద్యోగములనుబడ యుచున్న వారిలో చాలమందికి ఆ శాఖలకు సంబంధించిన విషయములు బొత్తిగా తెలియ వనుటలో నెట్టి అతిశయోక్తియునులేదు యిందువలన వారు ఉద్యోగములను బడసిన పిమ్మట ఆయాశాఖలకు సంబంధించిన పరీక్షలలో నెగ్గవలసి వచ్చుచున్నది వారు తమ పనులను నెరవేర్చుచు యిళ్లలో తీరుబడి వేళలలో యీ గ్రంధములను చదువవలెను వారికి వీటి నెవ్వరును బోధింపరు అందువలన వారు చాల కష్టపడవలసి వచ్చుచున్నది

ఇతర దేశములలో ప్రభుత్వోద్యోగములనిచ్చు టలోగల పద్ధతులిపుడు మనకు తెలిసియేయున్నవి గ్రేటు బ్రిటనులో గుమాస్తాలుగా చేరువారు 16–17 ఏళ్ల మధ్యను, కార్యనిర్వాహకులు 18–19 సంవత్సరముల మధ్యను, ఉన్నతాధి కారులు 21–24 ఏళ్ల మధ్యను ఉద్యోగములలో చేరవలెను మన దేశములోను ఇతర దేశముల లోను గూడ ఉద్యోగముల విషయమున ప్రభుత్వ నిబంధనలనే యితరులు గూడా అనుసరించు చున్నారు. 16–17 ఏళ్ల మధ్యనే ఉద్యోగము దొరుకునదియు నులేనిదియును తెలిసి పోయినచో కళాశాలలలో చేరుట అసౌకర్యమును ఇతర సౌకర్య ములను లేనివారు వృత్తి విద్యలనుభవించుటకు ప్రయత్నించెదరు అన్ని దేశములలోను వీరి సంఖ్యయే మిక్కిలి హెచ్చుగానుండును 16–17 యేళ్లవారిని ఉద్యోగులనుగా నియమించు నెడల వారికి ఆయా శాఖల విషయములను ముందుగా బోధించుటకు గూడ చాల అనుకూలముగా నుండును

### వృత్తి విద్యల ఆవశ్యకత

1 ప్రతి బాలుడును ప్రతిబాలికయు ను నిర్బంధముగా చదువు, వ్రాత, గణితము వీటిని మూడిటిని నేర్చుకొని తీరవలెను

2 మాధ్యమిక విద్యాభ్యాసము పూర్తి యగుసరికి, (1) కొన్ని ప్రభుత్వశాఖలలో చేర్చుటకును లేక (2) కొన్ని వృత్తి విద్యల నభ్యసించుటకును, (3) విశ్వవిద్యాలయములలో సయిన్సును కళలను అభ్యసించుటకును లేక (4) టెక్నికలు విషయములనైనను టెక్ని లాజికలు విషయములనైనను అభ్యసించుటకును తగిన సామర్థ్యము కలుగవలెను

3. విశ్వవిద్యాలయములలో చేరి కళలు, సయిన్సు, వృత్తి విద్యలు, ఉన్నత టెక్నాలాజికలు విషయములు మున్నగువాటి నభ్యసించుట

ఇందు నిమిత్తము మాధ్యమిక విద్యాభ్యాస విధానములో మార్పు జరుగవలెను దీనికి బదులు ఇతర విషయములను నేర్చుకొనగోరువారికి వాటిని నేర్పవలెను అందువలన విశ్వవిద్యాలయములలో చేరువారి సంఖ్య చాల తక్కువగును

దేశభాషలలో విద్య నేర్పుటను గూర్చి దేశమునందు 50యేళ్లనుండి చాల తీవ్రమగు చర్చ జరుగుచున్నది పాఠశాలలలోను కళాశాలలలోను దేశ భాషలలోనే విద్య నేర్పవలెనని 1868 లోనే హా॥ ఏ జె ఆర్బతునాటుగారు కాన్వొకేషను సభలో నుపన్యసించిరి ఇందులకు దేశభాషలలో గ్రంధములను వ్రాయవలెననికూడ ఆర్బతునాటు గారు తెలిపియుండిరి ఇదిముఖ్యకర్తవ్యమేయగును ముందుగా మండలములలో కొన్ని పాఠశాలలలో దేశభాషలలోనే విద్య నేర్పునట్లు చేయవలెను అందువలన నష్టము కలుగివచ్చునుగాని దానిని పూర్తిచేయుటకు దొరతనమువారట్టిపాఠశాలలకు ప్రత్యేకముగా గ్రాంటుల నియ్యవలెను ట్రెయి నింగు కాలేజీలలో ఉపాధ్యాయులకు దేశభాష లలో విద్య నేర్పవలసిన పద్ధతిని బాగుగా బోధించ వలెను వారొక దేశభాషను నిర్బంధముగా చదివి దానిలోని విద్య నేర్పవలెను ఈ పాఠశాల

# లక్షలాది ప్రజలకు సూపర్ భావం కలిగించే టీ!





"సూపర్ రుచి"





"సూపర్ డికాక్షన్"



"సూపర్ పొదుపు"

## బ్రూక్ బాండ్ సూపర్ డస్ట్

భారత దేశంలో అత్యధికంగా అమ్మబడుచున్న ప్యాకెట్ టీ




HTC BBI-5287

లలో పరీక్షల నిచ్చిన వారికి దేశ భాషలలో ఉన్నత విద్యను నేర్పుటకు ఒకటి రెండు కళాశాలలలో ప్రత్యేకముగా నేర్పాటు చేయవలెను. దేశభాషలలో విద్య నేర్పునపుడు వారికి ఇంగ్లీషు భాషనుగూడ ప్రత్యేకముగా నేర్పుచునే యుండవలను దేశభాషలలో మంచి పాండిత్యము కలవారు ఇతర భాషలలోని గ్రంథములను దేశభాషలలోనికి అనువదించునెడల దేశభాషలకు సరియైన సారస్వతాభివృద్ధి కలుగదుగాన పండితులు స్వతంత్రముగా గ్రంథములను వ్రాయునట్లు వారిని ప్రోత్సాహపరచుచుండవలెను

విశ్వవిద్యాలయములలో విద్యయొక్క ప్రమాణమును ఎంతమాత్రమును తగ్గించగూడదు అను విషయమును మదరాసు విశ్వవిద్యాలయమువారు బాగుగా గుర్తించియేయున్నారు తక్కిన విశ్వవిద్యాలయముల డిగ్రీల విలువ 50 రెట్లు హెచ్చుగా నున్నది అని సాడ్లరు సంఘ సభ్యులు తన కెరిగించిరని 1929 లో సర్ వి ఎం. కూట్సు ట్రాటరుగారు వైసు ఛాన్సలరుకు వ్రాసిరి. ఇందులకు ఉపాధ్యాయులును గూడా సమర్థులుగా నుండవలెను ఉపాధ్యాయుల హక్కులను విశ్వవిద్యాలయమువారు పట్టుదలతో కాపాడవలెను ఉపాధ్యాయుల సంఘములేర్పడి తమహక్కులను కాపాడుకొనవలెను. వారికి సరియైన జీతములనియ్యవలెను. మేనేజరులుగారు మన వారిని ఉద్యోగములలో నుండి తొలగించ

## నిర్బంధ విద్యా విధాన...

కుండునట్లు వారికి పూచీ యుండవలెను

లోకజ్ఞానమునకు వివేకము సహకారిగా నుండనిచో జ్ఞానము నిరుపయోగ మగును జ్ఞానము వలన గర్వమును, వివేకము వలన వినమ్రతయును కలుగును వివేకము వలననేమీ జీవితములు సఫలమగును వినయ వివేకములతో సత్యాన్వేషణమును చేయవలెను నిర్మలమైన మనసుతో నూతన విషయములను తెలుసుకొనుచుండవలెను అన్ని విషయములలోను సమాన ప్రజ్ఞ యుండవలెను మిడి మిడి జ్ఞానము పనికిరాదు కొందరేదోయొక్క విషయమును మాత్రమే దీక్షతో నేర్చుకొనుచుందురు తమ కాలమునంతను దానికొరకే వినియోగించుచుందురు ఇది మంచి పద్ధతికాదు ప్రపంచమున ధీమంతులు వ్రాసిన ఉత్తమ గ్రంథములను చదివి ఉదార భావములను, ఆశయములను అలవరచుకొనవలెను, అని మొదల్యారుగారు నుడివిరి

ఆంధ్రపత్రిక
1937 ఆగస్టు 11
సంచిక నుంచి

పిమ్మట న్యాయశాస్త్రము, వైద్య శాస్త్రము, ఇంజనీరింగు చదువు చెప్పుట, వ్యవసాయము, పత్రికా నిర్వహణము మున్నగు వాటిలో డిగ్రీలను బడసినవారికి వేరు వేరుగా హితోపదేశము చేసిరి

పౌరుల కర్తవ్యము దేశాభిమానముతోడి మానవులకు సర్వవిధముల తోడ్పడుట, ఇతరుల అభిప్రాయములను శాంతముగా వినుట, మానవులనందరినిసోదరులవలెచూచుట, ఐకమత్యము, పరులసుగుణములనేగాని లోపములనువెల్లడింపకుండుట స్వార్థపరత్వమును విడనాడుట, పరోపకారము మున్నగు విషయములను గూర్చి మొదల్యారుగారు నొక్కి చెప్పిరి

ప్రపంచమున ఇతర దేశములకును ఇతర సామ్రాజ్యములకు యే విషయమునందును తీసిపోనట్టి భారత సామ్రాజ్య మేర్పడవలెను. మన దేశములో దేశద్రోహులును యితర దేశములలో శత్రువులునుగూడ నుండగూడదు. విశ్వమానవకోటి శాంతిని నైతిక మానసిక శాంతిని బడయవలెను సర్వేశ్వరుడు మీకు సకల శుభములనొసగుగాక, ఉదార భావములతో ఘనకార్యములనొనరించి మాతృదేశమునకు అఖండఖ్యాతిని, మానవకోటికి మహోపకారమును మీరు చేయగలుగునట్లు భగవంతుడనుగ్రహించుగాక'' అని మొదల్యారుగా రాశీర్వదించి విరమించిరి. ★

ఎక్కడ చూసినా లాటరీ టిక్కెట్ల షాపులే!

నెలకు కోటి రూపాయిల వరకూ కమీషన్ రూపంలో మిగులుతుందని ఒక అంచనా

లాటరీల ఫలితాలను ఎప్పటికప్పుడు తెలపడానికి దేశంలో పలు దిన, వార, పక్ష పత్రికలు గూడా వెలిశాయి మద్రాసు నుండి ''రాఫల్ రిజల్ట్స్'' దినపత్రిక వెలువడుతున్నది అక్కడి నుండే వెలువడె 'గోల్డ్‌మైన్'' పత్రిక కార్యాలయానికి దేశంలో ఎక్కడి నుండి ఫోన్ చేసినా, ఏ లాటరీ ఫలితం అయినా చెప్తారు

చాలామంది లాటరీలద్వారా నల్లధనం తెల్లగా చేసుకోవడానికి ప్రయత్నిస్తుంటారు పెద్ద బహుమతులు వచ్చిన వారిని కలసి, పన్ను మినహాయింపకుండా బహుమతి మొత్తం ఇచ్చికొని, నల్లధనం కొంత వదిలించుకోవడానికి ప్రయత్నిస్తుంటారు

లాటరీల నిర్వహణలో పలు అవకతవకలు గూడా తరచూ వింటూంటాము టిక్కెట్లు ముద్రిస్తున్న ప్రెస్‌లలో అదనంగా ముద్రించి ''బ్లాక్''లో అమ్మడం, నంబరులోని టిక్కెట్లు ముద్రించి బహుమతి వచ్చిన నంబరు ముద్రించడం వంటివి తరచూ జరుగుతున్నవి

మొత్తం మీద లాటరీలు నేడొక్క భారీ పరిశ్రమగా రూపొందాయి కష్టపడకుండా, అదృష్ట ఆధారంగా కోటీశ్వరులు కావచ్చని ప్రబోధించే లాటరీలను నడపడం ఒక సంక్షేమ ప్రభుత్వానికి ఎంతవరకు సబబు ?— గంభీరంగా ఆలోచించవలసిన ప్రశ్న కేవలం లాభాల కొరకు జూదం వంటి లాటరీలు నిర్వహించడం సమర్థనీయమా ? ఆశించదగిన విషయమా ?

— చలసాని నరేంద్ర

# "అప్రోచిలాం...."



ద్విభాష్యం రాజేశ్వరరావు

"మిమ్మల్ని ఆ బ్రహ్మదేవుడు కూడా మార్చలేడు!..." అన్నపూర్ణమ్మగారు గొణుక్కుంటూ పోపు గరిటె చారుగిన్నెలో ముంచి చుయ్ మనిపించేరు.

ఆ శబ్దంలో కూడా ఆవిడ గొణుగుడు ముద్దుకృష్ణయ్యగారి చెవిని స్పష్టంగా పడింది. చారుకు తిరగమోత పెడుతూవుంటే వచ్చే ఆ శబ్దం ఆయనకు ఎంతో ఇష్టం! అన్నపూర్ణమ్మగారి సణుగుడు మరీ ఇష్టం!!

వంటింట్లోంచి బయటకు వచ్చేస్తున్న మనిషల్లా — ఆగిపోయి — వెనక్కువెళ్ళి ''ఈవేళ శాకపాకాలు ఏమిటో చెప్పేవుకాదు.. '' అన్నారు చిన్నగా నవ్వుతూ.

చారుగిన్నెమీద మూతపెడుతూ కాస్త నిరసనగా ఆయనవంక చూసింది ఆవిడ.

''ఏముంది ? రోజూలాగే పంచభక్ష్య పరమాన్నాలు ! దోసకాయపప్పు చేశాను ! ముక్కలపులుసు ! అందులోకి మీ కిష్టమని నాలుగు అప్పడాలు కాల్చేను ! ఆవకాయ, గోంగూరపచ్చడీ, దబ్బకాయ పొక్కెంపూ ఎలాగూ ఇంట్లో వుండనేవున్నాయి ! నిన్న బొబ్బట్లు వండేనుకదా, అందుకని ఈవేళ గారెలు వండు తున్నాను ! అన్నట్టు మరిచిపోయాను, 'ఆ కాకరకాయ' కూరంటే మీకు ప్రాణం కదా ! అందుకని వాటిని చక్రాల్లా తరిగి నేతిలో వేయించాను. చాలా !'' అంది తడిచేతులు కొంగుతో అద్దుకుంటూ.

ఆమె మాటల్లోని ఎగతాళి ఆయనకు అర్ధమయింది. రెండు క్షణాలపాటు ఆవిడవంక కన్నార్పకుండా చూస్తూ వుండిపోయారు.

గుండ్రని ముఖం, కలువరేకుల్లా పెద్ద కళ్ళు, విశాలమయిన నుదుటన పెద్దకానీ సైజులో కుంకుమబొట్టు ! తలమీద వెండి తీగల్లా మెరిసి తళుక్కుమంటున్న కురులు ! ఆమె చూపుల్లో క్షణకాలం నిరసన, ఆ వెనుకనే ఆప్యాయత ! మాటల్లో ఆర్ద్రత, మందలింపు అన్నీ వున్నాయి !

''రోజురోజుకీ మీరు చిన్నకుర్రాడిలా తయారవుతున్నారు. ఇంకా తెల్లారి తొమ్మిదిన్నర అయినా కాలేదు. అప్పుడే వంటింట్లోకి మూడుసార్లు తొంగిచూసి వెళ్ళేరు. ఆకలికి కాస్త ఆగలేకపోతే ఎలాగ ? కోడలు స్నానానికి వెళ్ళింది. వచ్చి చూస్తే సణుక్కుంటుంది...'' అన్నారు అన్నపూర్ణమ్మగారు మందలింపు ధోరణిలో ! ఈ మాటలు పట్టించుకోనట్లు ''ఈవేళ కూర వండలేదా పూర్ణా ? '' అన్నారు.

''వండలేదండీ ! ప్రతి పూటా కూర కావాలంటే ఎలాగ ? మార్కెట్లో కూరల ధరలు మండిపోతున్నాయి. ఆఖరికి పుచ్చు వంకాయలు కూడా కిలో మూడు రూపాయలు పెడితేగాని దొరకటంలేదు. నిన్న రఘు ఆఫీసుకు వెళ్లే టప్పుడు కూరల గురించి జ్ఞాపకం చేశాను. సాయంకాలం వట్టి చేతులతోనే చక్కా వచ్చేడు. మరీ రొక్కించి అడిగితే బాధ పడతాడని ఊరు కున్నాను. నెలాఖరు రోజులు ! వాడికీ ఏవో ఖర్చులుంటాయి కదా ! ఈవేళ ఆవకాయ, మజ్జిగ వేసుకుని తిని ఆఫీసుకు వెళ్లిపోయాడు. నా పూజ ఆలస్యం అవటంతో పిచ్చి కుంకకి చారయినా చేసిపెట్టలేకపోయాను.'' మాటలు ఆపి కళ్లు ఒత్తుకుంది అన్నపూర్ణమ్మగారు.

ముద్దుకృష్ణయ్యగారు మౌనంగా బయటకు వచ్చేసి వీధి వరండాలోని పడక్కుర్చీలో వాలి పోయారు.

వేసవికాలం ఎండ చిక్కబడుతోంది ! గాలి ఎక్కువగా ఆడకపోవటం వలన చికాగ్గావుంది ! ఎదురింటి వేపచెట్టు మీద వాలిన కాకి అదేపనిగా అరుస్తూ గోల చేస్తోంది.

ఆయనకు కడుపులో మంట ప్రారంభమవు తోంది సన్నగా !

దానిపేరు ఆకలి అని ఆయనకు స్పష్టంగా తెలుసు ! బలంగా కళ్ళు మూసుకున్నారు రెండు క్షణాలు !

''హాయ్ ! తాతయ్యా ! '' అన్న పిలుపు విని కళ్లు విప్పేరు.

ఎదురుగా ఆరేళ్ల ఇందుమతి !

''ఇందూ! అప్పుడే బడి వదలిపెట్టేశారా?'' అంటూ మనవరాల్ని ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నారు.

''ఈవేళ ఆఖరి పీరియడ్ మాస్టారు రాలేదు. అందుకని తొందరగా వదిలేశారు ! తాతయ్య ! నువ్వు ఇంకా బువ్వ తినలేదా ?'' అంది ఆయన కడుపు తడిమి చూస్తూ.

''ఇంకా లేదమ్మా ! నువ్వు వస్తే ఇద్దరం కలిసి తిందామని చూస్తున్నాను. లోపలకు వెళ్లి మనిద్దరికీ అన్నం వడ్డించమని చెప్పు ! '' అన్నారు మనమరాలిని బుజ్జగిస్తూ.

తాతయ్య ఒడిలోనే పుస్తకాల సంచీ వదిలేసి లోనికి పరుగెత్తింది ఇందు !

పదినిమిషాలలో వంటింట్లోంచి పిలుపు వచ్చింది.

అడ్డాకు ముందు పీట మీద కూర్చున్న ముద్దుకృష్ణయ్యగారు రెండు నిమిషాలు కనులు మూసుకుని గాయత్రి జపించి కనులు తెరిచేసరికి ఎదురుగా విస్తట్లో అన్నం, ఆవకాయ, ఉసిరికాయ పచ్చడి మాత్రం కనుపించేయి. సగం ఆకలి చచ్చిపోయింది ఆయనకు.

అన్నపూర్ణమ్మగారు చిన్న గరిటెతో పప్పు తెచ్చి ఇందు విస్తట్లో వడ్డిస్తూ ''ఈ నాపసానికి పప్పంటేగాని ముద్ద దిగదు. నాలుగు బద్దలు మిగిలితే దీని కోసమని ఉడకేశాను'' అని గదిలో జడవేసుకుంటున్న కోడలికి వినిపించేలా గట్టిగా అని ఇటూ అటూ చూసి వెళ్లిపోతూ గరిట్లో మిగిల్చిన సగం పప్పు భర్త విస్తట్లో అన్నంమీద విదిలించి లోనికి చక్కాపోయింది. కోడలు కంటపడుతుందనే భయంతో గబగబా దాన్ని కలిపి ఆబగా నాలుగు ముద్దలు నోట్లో కూరుకున్నారు ముద్దుకృష్ణయ్యగారు !

కోడలు జడవేసుకుని తలలో పిన్నులు సర్దుకుంటూ వంటింటివైపుకు వచ్చింది, ''అత్తయ్యా ! బియ్యం ఒకటో తారీఖువరకూ వస్తాయా ?'' అంటూ.

''రావు ! రెండురోజుల్లో తెచ్చు కోవాలమ్మా !'' అన్నారు అన్నపూర్ణమ్మగారు.

''ఏవిటీ ? నలభై కేజీలూ ఇరవైమూడు రోజుల్లోనే అయిపోతున్నాయా ? ... ఇంట్లో అందరివీ పిట్టతిళ్ళే ! ... మరి ఎలా అయి పోతున్నాయో అర్థం కావటంలేదు ! ... గుంట ముండా ! ... అన్నం కలుపుకుని తినక నా వంక గుడ్లు మిటకరించి చూస్తావేం ?'' అంటూ ఇందుని ఒక్క కసురు కసిరి గదిలోకి వెళ్ళి పోయింది ఆమె.

ముద్దుకృష్ణయ్యగారు తలవంచుకుని గబగబా తినటం ఆరంభించేరు. కంట్లో తిరిగిన నీటిబిందువు క్రింద రాలిపడకుండా పండిన గుబురు మీసాల సందున చిక్కడిపోయింది.

* * *

మరునాడు ఉదయం ఇందుని వీధివరండాలో కూర్చోబెట్టుకుని తెలుగు పుస్తకంలోని పద్యాలు వల్లెవేయిస్తున్నారు. కోడలుపిల్ల పక్కింటికి బాతాఖానీకి వెళ్ళింది. అన్నపూర్ణమ్మగారు బయటకువచ్చి ద్వారాన్ని ఆనుకొని నిలబడి నవ్వుతూ అడిగేరు.



"పదిగంటలయిపోతోంది, అయ్యగారు ఈవేళ శాకపాకాలు అడగలేదేం ?"

మెల్లగా పుస్తకంలోంచి తలఎత్తి విరిగిపోయిన కళ్ళజోడు అద్దాల్లోంచి ఆమె వంక చూశారు.

తరువాత "ఏమిటీ కథ ?" అన్నారు కుతూహలంగా.

"నిన్న సాయంకాలం మన పక్కింటి పార్వతమ్మగారు కొంచెం ఆకాకరకాయలు పంపించారు. మీకు ఆకాకరకాయ వేపుడంటే చాలా ఇష్టమని ఎప్పుడో ఆవిడతో మాటల సందర్భంలో అన్నాను. అది గుర్తుపెట్టుకొని ఓ పదికాయలు పంపేరు. ఎలాగూ కోడలూ, రఘూ ఇద్దరూ ఆ కూర తినరు. ప్రత్యేకంగా మీ కోసమే ఈ వేళ చేస్తున్నాను. ఒక్క పావుగంటలో వంటయిపోతుంది" అన్నారు.

ముద్దుకృష్ణయ్యగారి ముఖంలో ఆనందం వీచికలా కదిలింది.

"ఇంతసేపు చెప్పవేం మరి ? తొందరగా వంటకానీయ్ ! ఆఖరున చిన్న వెల్లుల్లి కారం తగిలించటం మరిచిపోకు ! ఆ కారం తగిలిస్తే ఆ మజాయే వేరు !! దోరగా వేయించు ! మరీ మాడ్చిపారెయ్యకు ! " అన్నారు హుషారుగా.

ఆకాకరకాయ వేపుడు సంగతి చెప్పేసరికి భర్తలో కలిగిన హుషారు చూసేసరికి కళ్ళనీళ్ళ పర్యంతం అయింది అన్నపూర్ణమ్మగార్కి ! మెల్లగా వంటింట్లోకి కదిలిపోయారు ఆవిడ!

"తాతయ్యా ! ఆకాకరకాయలా? అవేంటి? కూర వండుకుంటారా ?" అంది ఇందు చక్రాల్లా కళ్ళు తిప్పుతూ.

"ఓసి పిచ్చితల్లీ ! ఆకాకరకాయలు చూడలేదూ ? కూర భలే రుచిగా వుంటుందిలే ! వేగిన తరువాత అందులో గింజలు జీడిపప్పుకన్నా రుచిగా వుంటాయి ! కాస్త బెల్లం తగిలించి వండితే ఆ రుచి అద్భుతం !... నువ్వు పెళ్ళిచేసుకున్నాక ఈ తాతయ్య నిన్ను చూడ్డానికివస్తాడు కదా మీ ఇంటికి... అప్పుడు రెండు పూటలా నువ్వు ఆకాకరకాయలే వండిపెట్టాలి !"అంటూ ఇందూ వంక ఆప్యాయంగా చూసేరు.

"ఛీ ! నాకు పెళ్ళి వద్దు !" అంటూ చదువుతున్న పుస్తకం తాతయ్య ఒళ్ళోకి విసిరేసి ఇంట్లోకి తుర్రుమంది.

వెళ్ళిపోతున్న ఇందూ వంక చూసి తృప్తిగా నవ్వుకున్నారాయన !

"నాన్నా ! ఎవరొచ్చారో చూడు !" రఘు మాటలతో వీధివంక చూశారు. మెట్ల దగ్గర నిలబడి చిరునవ్వు నవ్వుతున్న వ్యక్తివంక రెండు నిమిషాలు సందేహంగా చూస్తూ వుండిపోయారు.

"శంకరం నాన్నా ! అనకాపల్లిలో మనం వేదులవారి వీధిలో వుండేటపుడు మనపక్కింట్లో వుండేవాడు కదా ! పోస్టుమేస్టారి అబ్బాయి !" అంటూ రఘు వివరాలు అందించేడు.

## అప్రణిహితాం

ముద్దుకృష్ణయ్యగారు కుర్చీలోంచి లేస్తూ "నువ్వా శంకరం ! ఎంత ఎదిగిపోయావ్ ? రా బాబూ !" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించేరు.

"ఇప్పుడు శంకరం పెద్ద ఆఫీసరు నాన్నా ! ఇన్సూరెన్సులో పనిచేస్తున్నాడు ! ఒరిస్సాలో వుంటున్నాడట ! ఈ వూరొచ్చి మనింటికి రాకుండా వెళ్ళిపోదామనుకున్నాడు. దారిలో కనిపిస్తే బలవంతంగా తీసుకువచ్చాను !" అని శంకరంవైపు తిరిగి "నాన్నగారితో కబుర్లు చెప్తూవుండు ! పది నిమిషాల్లో భోజనం ఏర్పాట్లు చేయిస్తాను !" అన్నాడు. "అమ్మా ! పోస్టుమేస్టారి అబ్బాయి శంకరం వచ్చాడు !" అంటూ లోనికి వెళ్ళేడు.

వంటింట్లోకి వెళ్ళి తల్లి వేయిస్తున్న ఆ కాకరకాయ వేపుడువంక చూసి దీర్ఘంగా నిట్టూర్చి "రక్షించావు ! శంకరం కనబడితే భోజనానికి తీసుకువచ్చాను ! కనీసం కూరయినా లేదేమోనని భయపడ్డాను ! భోజనం చేసి మెయిలుకు వెళ్ళిపోతాడువాడు !" అన్నాడు రఘు మెల్లగా.

"అలాగే బాబూ ! వడ్డించేస్తాను !" అంది ఆవిడ.

పావుగంట తిరక్కుండా విస్తరివేసి శంకరానికి వడ్డించేరు అన్నపూర్ణమ్మగారు.

రఘు శంకరం పక్కనే పీట వేసుకుని కూర్చుని కబుర్లు ఆరంభించేడు.

ముద్దుకృష్ణయ్యగారు వంటింటి గడప అవతల నిలబడి శంకరం కుటుంబ వ్యవహారాలన్నీ అడిగి తెలుసుకుంటున్నారు.

"మొహమాటపడకుండా తినుబాబూ " అంటూ ఆప్యాయంగా వడ్డిస్తోంది అన్నపూర్ణమ్మగారు.

"ఆకాకరకాయ వేపుడు బ్రహ్మాండంగా వుందండీ ! నిజంగా ఈ వేళ జిహ్వ లేచి వచ్చింది. మాకు 'తాల్చేరు'లో ఈ కూర దొరకదు ! మా అమ్మగారి చేతి వంట జ్ఞప్తికి వస్తోంది నాకు !" అన్నాడు శంకరం తృప్తిగా తింటూ.

### కొరకాసు

ఏ కొరతాలేని
జిగేలు మనిపించే
వొంటిబిగి
కొసదాకా కాలిన కొరకాసు,
కాయం కట్టెనిండా
కణకణమనే బూది !

— నిఖిల్

"ఎంతమాట బాబూ ! ఇంకొంచెం వేసుకో !" అంటూ వేయించిన మూకుడులోని ఆఖరి ముక్కలుకూడా తీసుకువచ్చి శంకరం విస్తట్లో వడ్డించారు. ఖాళీ అయిపోయిన మూకుడువంకా, అన్నపూర్ణమ్మగారి ముఖంవంకా మార్చి మార్చి చూసేడు ముద్దుకృష్ణయ్యగారు.

రెండూ నల్లగానే కనుపించేయి ఆయనకు !

ఆయన ముఖంలో నెత్తురు మాయమవటం మాత్రం స్పష్టంగా గమనించింది, కేవలం ఒక్క అన్నపూర్ణమ్మగారు మాత్రమే ! !

* * *

ఉదయం ఏడు గంటలయ్యేసరికి బట్టలు వేసుకుని తెమిలి పోయిన రఘు వంక చూస్తూ "ఈవేళ ఇంత తొందరగా తయారయిపోయావేమిటి ? " అన్నారు ముద్దుకృష్ణయ్యగారు.

"శంకర మఠంలో మా బాబాయి కూతురు పెళ్లి ఈవేళ ! " అంటూ కోడలు పిల్ల గదిలోంచి బయటకు వచ్చింది. ఆమె అప్పుడే చీర సింగారించుకుని ముస్తాబయి పోయింది.

"ఎవరు ? నర్సింహం కూతురికే ! " అన్నారు ఆనందంతో.

"అవును మావయ్యా ! పదింటికి పెళ్లి ! భోజనాలు చేసి సాయంకాలం వచ్చేస్తాం ... ఈవేళ సెలవు పెట్టేశారు ఆయన ! " అంది.

పెళ్లి భోజనం అనగానే పులిహోర, బూర్లు, అరటికాయ ఉప్మాకూర, వంకాయ ముద్దకూర, పప్పు, నెయ్యి, ముక్కల పులుసు, మిఠాయి, అరిసెలు, బూందీ అన్నీ వరసగా కళ్లముందు మెదిలేయి ఆయనకి ! ఆకాకరకాయ కూర కూడా చేస్తారేమో ! వాళ్లు బాగా డబ్బున్న వాళ్లే ! ఆకాకరకాయ వేపుడు వడ్డించినా ఆశ్చర్యపోనక్కరలేదు ! తను లాంటి దరిద్రులు కాదు వాళ్లు !

ఆయనకు ఏ మూలనో పేగుల్లో కదలిక ఆరంభ మయింది !

మామగారి పేగుల్లోని కదలికను ఆపలించకుండానే చూడగలదు కోడలు !

"నేనూ, ఆయనా, ఇందూ ముగ్గురం వెళ్లొస్తాం ! మీరూ, అత్తగారూ కాస్త ఇంటిని కనిపెట్టుకుని వుండండి ! "అంటూ మామగార్ని మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండా "ఇందూ ! అలా గౌను మాపుకోకు ! పెళ్లికి వెళ్తున్నాం కదా ! " అని బయలుదేరదీసింది. రఘు తల దించుకుని "వెళ్లొస్తాం నాన్నా ! " అంటూ కదిలి పోయాడు ! కోడలు పిల్ల వాడి చూపులు, వాడి నోరు నొక్కేస్తాయని ఆయనకు తెలుసు !

వాళ్లు ముగ్గురూ సాగిపోయిన వంకే రెండు క్షణాలు తదేకంగా చూస్తూ వుండి పోయారు. దీర్ఘంగా నిట్టూర్పు వదలి ప్రక్కకు చూస్తే




# కోరమాండల్ పెయింట్స్‌తో ప్రతిరోజూ పండగ శోభ

రంగులతో మెరిసే ద్వారబంధాలు, ఆనందంతో వెలిగే ముఖారవిందాలు – పండగనాడు ఇంటింటా కొత్త కాంతి తళుక్కున మెరుస్తుంది. నూతన దుస్తుల రెపరెపలు, మూకిట బూరెల బుసబుసలు, వాకిట బూరాబాకాల సరిగమలు – పండగ పూట సందడి చేసే సంగీతం కూడా వింతగానే వుంటుంది.

కోరమాండల్ పెయింట్స్‌తో సంవత్సరమంతా ఆ కాంతి ప్రతిబింబిస్తుంది, ఆ సంగీతం ప్రతిధ్వనిస్తుంది. ఆ నిత్య నూతన శోభకు మూడు దివ్యమైన సింథటిక్ ఎనామిల్స్ వున్నవి – 'కోరోలక్స్' 'కోరోలైట్' 'డాల్ఫిన్.' మీ గృహ బాహ్య సౌందర్యమునకు 'సి పి సెమ్' సిమెంట్ రంగులు కూడా లభ్యము.

నిత్య పచ్చ తోరణాలు
కోరమాండల్ వర్ణాలు





**కోరమాండల్ పెయింట్స్**
**& కెమికల్స్ లిమిటెడ్**
విశాఖపట్టణం – 530 003.

BRAIN-WAVE/CPC/7

గుమ్మం దగ్గర నిలబడ్డ అన్నపూర్ణమ్మ గారు కనుపించేరు.

"పూర్ణా ! చూశావా ? పెళ్లికి వెళ్తా కనీసం మనల్ని రమ్మని కూడా పిలవలేదు !" అన్నారు.

"మీకు మరీ చాదస్తం ! వాళ్లతో మన మెందుకు ?" అన్నారు నిర్లిప్తంగా.

"అది కాదు పూర్ణా ! కనీసం ఈవేళయినా కడుపునిండా తృప్తిగా భోజనం చేసేవాణ్ణి కదా !..." ఆ మాటలు అంటూంటే ఆయన కంఠం వణికింది !

తరువాత కళ్ళు మూసుకుని కుర్చీలో వాలి పోయూరాయన !

గుండెల్లో అనిర్వచనీయమయిన బాధ పీచికలా కదలింది !

రెండు నిముషాల తర్వాత అన్నపూర్ణమ్మ గారు ఆయన దగ్గరకు మెల్లగావచ్చేరు.

తన గుప్పెట్లో నలిగిపోయిన రెండు రూపాయల నోటును ఆయన చేతిలో వుంచుతూ "మార్కెట్టుకు వెళ్ళి ఈ రెండు రూపాయిలతో ఆకాకరకాయలు కొని తెచ్చుకోండి ! పావుకేజీ కాయలు రాకపోవు ! మొన్న మీ నోటిదగ్గర కూర ఆ శంకరానికి వడ్డించవలసి వచ్చింది ! ఒక గరిటెడు వెన్న రహస్యంగా జాగ్రత్త చేశాను. నెయ్యికాచి దానితో మీకు వేపుడు చేసి పెడతాను. కోడలుపిల్ల ఇంట్లో లేదు కదా !..." అన్నారు ఆవిడ.

ముద్దుకృష్ణయ్యగారి కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి. "పూర్ణా !..." అని మాత్రం అనగలిగేరు. తరువాత ఆయన కంఠం పూడుకు పోయింది !

వెన్నపూస కాగి ఘుమఘుమ లాడింది. ఆకాకరకాయల్ని చక్రాల్లా గుండ్రంగా తరిగి నేతితో వేయించారు అన్నపూర్ణమ్మగారు ! వంట చేస్తూవుంటే ఆవిడకే నోరు వూరింది. అయిదు సంవత్సరాల క్రితం ఎప్పుడో ఒకసారి ఇలా నేతితో ఒక పండగనాడు ఈ కూర వండినట్లు జ్ఞాపకం.

## అప్రణిహితాం

మళ్ళీ కుదరనే లేదు ! ఆయనకు తిండంటే ప్రాణం! అన్నీ రుచులూ కావాలి ! అందునా ఈ కూరంటే మరీ ప్రాణం ! చాలీ చాలని జీతపు రాళ్ళతో బతుకీడుస్తున్న కొడుకు పంచన ముద్దుకృష్ణయ్యగారి జిహ్వ రోజు రోజుకూ చచ్చిపోతోందని ఆవిడకు తెలుసును ! కాని, ఏం చేయటం ?!

ఇన్నాళ్ళకయినా మళ్ళీ ఈ రకంగా చేసి భర్తకు వడ్డించగలుగుతున్నందుకు గుండెలనిండా తృప్తిగా అనిపించింది ఆవిడకు.

వంటింట్లో పీటవాల్చి, ఆకువేసి మంచి నీళ్ళ చెంబు, గ్లాసు సర్దేరు ఆవిడ !

"లేచి, కాళ్ళు కడుక్కోండి !" అంటూ వంటింట్లోంచే కేకపెట్టేరు. ఎప్పటికీ భర్త నుండి సమాధానం రాకపోయేసరికి వీధి వరండా లోకి ఆత్రుతగా వచ్చేరు.

వరండాలో పడక్కుర్చీలో ముద్దుకృష్ణయ్య గారు పడుక్కుని వున్నారు. ఆ య న కళ్ళు మూతలు పడివున్నాయి...

*   *   *

"శ్రాద్ధా సంపాదితా పదార్థాం...దేశతః కాలతశ్చా... శ్రాద్ధ యోగ్యం ముఖ్యా..." పురోహితుడు మంత్రం చదువుతున్నాడు.

రఘు నిష్ఠతో తద్దినం పెడుతున్నాడు.

బ్రాహ్మలిద్దరు తద్దినపు భోక్తలుగా ఒకరు ఉత్తర దిక్కుకు, మరొకరు తూర్పు దిక్కును అభిముఖులయి కూర్చుని వున్నారు.

"బాబూ ! ఈ 'కూర్చ'తో ఉదకం భోక్త చేతులుమీద కొట్టి, తరువాత ఈ దర్భతో కలిపి నువ్వులు వారి విస్తరి దగ్గర ధారపొయ్యి! ధార పడేటప్పుడు కుడిచేతి బొటనవేలు కుడి పక్కగా వంచి ధారపొయ్యాలి !..." అంటూ వివరణ ఇస్తున్నాడు పురోహితుడు.

రఘు "స్వాగతం" అంటూ పితృదేవతల్ని ఆహ్వానించేడు.






హైదరాబాదులోని రవీంద్రభారతిలో ఇటీవల మానస ఆర్ట్ థియేటర్స్ తృతీయ వార్షికోత్సవాన్ని జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న ప్రముఖ సినీనటి జయసుధ. సంస్థ కార్యదర్శి శ్రీ రఘుశ్రీ తదితరులని కూడా చిత్రంలో చూడవచ్చు.

పురోహితుడు వల్లిస్తున్న మంత్రం ఆపి భోక్తలవంక చూస్తూ "అయ్యా ! వీరి తండ్రి గారు ముద్దుకృష్ణయ్యగారు మంచి భోజన ప్రియులు! మీరు కడుపునిండా హాయిగా తృప్తిగా తినండి !... ప్రస్తుతం వారి తండ్రిగారు మిమ్మలను ఆవహించియున్నారు కనుక మీరు తృప్తికా తింటే వారు తృప్తిగా తిన్నంత సంతోషం !..." అంటూ యథావిధిని తాను చెప్పాల్సిన నాలుగు మాటలూ చెప్పి దర్భలు చీల్చి కట్టలు కట్టటంలో నిమగ్నమయ్యాడు.

భోక్తలిద్దరూ పావుగంటలో భోజనం ముగించి తృప్తిగా కడుపులు తడుముకున్నారు. ఇద్దరి ఆకుల్లోనూ ఆకాకరకాయకూర మాత్రం మిగిలిపోయింది !

రఘు మతిపోయినట్లు భోక్తల వంక చూశాడు. తరువాత మెల్లగా అన్నాడు "ఇద్దరూ ఆ కూర తినలేదే ?"

"మేమిద్దరం క్రితం సంవత్సరం తీర్థ యాత్రలకు వెళ్ళినపుడు కూడబలుక్కుని గయలో ఈ కూరను వదిలేశాం !" అన్నాడొకాయన.

"ఇది దొరకడం అరుదు ! అందునా విపరీతమయిన ఖరీదు ! అందుకని దీన్ని వదిలేశాం !" అన్నారు మరో భోక్త !

వంటింటి గుమ్మం దగ్గర నిలబడి వాళ్ళ మాటలు వింటున్న అన్నపూర్ణమ్మగారు చీర కొంగుతో కళ్ళు ఒత్తుకున్నారు !!! 

ఎప్పుడో రాయాల్సిన లెటరు ఇప్పుడు రాస్తున్నా నంతే మీకభ్యంతరం లేకపోతే జవాబు రాయండి

ఇట్లు
సింహళాదేవి

ఆ ఉత్తరంలో పక్కన తన అడ్రసుకూడా రాసి పోస్టు చేసింది అదీ తన స్వహస్తాలతో

అది పోస్టు చేసినప్పటినించీ ఆమెకి కంటి మీద కునుకులేదు కడుపునిండా తిండిలేదు

ఆ ఉత్తరం సరిగ్గా అనుకున్న రోజున అందాలి నవీన్‌బాబు ఆ సమయంలో ఇంట్లో వుండాలి అది ఆయన వెంటనే చూడాలి చూడగానే తనకి రిప్లయ్ రాయాలి రాయగానే అది పోస్టు చేయాలి అది వెంటనే తనకి అందాలి ఇవన్నీ గడవాలంటే కనీసం ఒకనాలుగు రోజులు ఆ నాలుగు రోజులు తనపాలిట నాలుగు యుగాలు అనుకుంది ఏదో తెలియని కంగారు మనసులో పుట్టుకువచ్చిన సింహళాదేవి

సింహళ తల్లిదండ్రులకి గారాల పుత్రిక ఇంక తోడబుట్టిన వారెవరూ లేరు ఆమె ఒక్కర్తే

కూతురంటే, తండ్రి రామగోపాల్‌కి తగని ప్రేమ అతనెంత ముద్దు చేస్తాడంటే, ఒక్కొక్కసారి భార్య సరళ విసుక్కునేంత

''ఆడపిల్ల నతిగా గారాబం చేసి పాడు చేస్తున్నారు మీరు రేపు అత్తవారింటికి వెడితే ముందు కష్టందుకు మనిద్దర్నీ ఆడిపోసు కుంటారు'' అని అతన్ని మందలిస్తుండేది

''అమ్మాయిని అత్తారింటికి పంపడం, అక్కడ మాట అనిపించడం కూడానా ! అవేం లేవు నేను అల్లుడిని ఇల్లరికం తెచ్చుకుంటాను'' అని జవాబిచ్చేవాడు రామగోపాల్

''చూద్దాం లెండి !'' అంటూ సరళ భర్త మాటని తేలిగ్గా కొట్టిపారేస్తుండేది

ఇవన్నీ వింటూ తనలో తనే నవ్వుకునేది సింహళాదేవి

అందరికీ రోజులు మామూలుగా గడుస్తున్నా సింహళకి మటుకు రోజుకు ఇరవై నాలుగు గంటల బదులు నలభై ఎనిమిది గంట లున్నట్టు ఫీలయ్యేది అసలు రోజు గడవడమె ఆమెకి తగని దుర్భరంగా వుంది

చివరకు నాలుగు రోజులు గడిచాక, ఆమె అనుకున్న నాలుగు యుగాలు గడిచినట్లయి — ఆమెకి చిరునవ్వు చిందిస్తూ కవరు ఇచ్చి వెళ్ళాడు పోస్టుమాన్

ఫ్రమ్ అడ్రసు చూసేసరికి ఆమె గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి ఆశ్చర్యం, ఆనందం ఆమెని ఉక్కిరి బిక్కిరి చేయగా గభాలున కవరు చింపింది

''డియర్ సింహళాదేవి,

ఈరోజు అందిన లేఖల్లో సూదంటు రాయిలా ఆకర్షించింది మీ ఉత్తరమే ! ఎన్నో

ఎలాంటివి ఎంచుకున్నా సరే-
ఎమరాల్డ్ సూటింగులు, స్టార్ లైట్ షర్టింగులు
మీ వంటికి సొగసునిస్తాయి
మనోహరమైన రంగుల చక్కని మేళవింపుల్లో,
మీ మనసుకు నచ్చే రకాల్లో దొరుకుతాయి



# దావణగెరె

**అందించిందే సమ్మేళనతో నూతన సరళి కల్పన !**

ది దావణగెరే కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగెరే 577 002

షోరూములు
కావేరి భవన్, బెంగుళూరు-560 009
దాజీబాన్ పేట్, హుబ్లి-580 020
చిత్రదుర్గ రోడ్, దావణగెరే-577 002

THOMAS/8301-C/TEL

లేఖలు వచ్చినా అందులో లేని ప్రత్యేకత ఏదో మీ లెటర్‌లో కనిపించబట్టే వెంటనే కాగితం మీద కలం పెట్టాను. మీరు నా నవలలన్నీ చదివానన్నారు. చాలా సంతోషం — మీలాంటి పాఠకులుండటం మించిన అదృష్టం. రచయితకి వేరే ఏముంటుంది? ఇంతకీ మీరేం చేస్తున్నారు ? చదువుకుంటున్నారా ? ఎక్కడన్నా జాబ్ చేస్తున్నారా ? మీకు సోదర సోదరీ మణులంతా వున్నారా ? మీ గురించిన వివరాలతో ఉత్తరం రాస్తారుగా !

నవీన్‌బాబు.

ఆ ఉత్తరం చదివేసరికి చంద్రమండలంలో ఆరమ్‌స్ట్రాంగ్ కాక తనే కాలు పెట్టినట్లు సంబరపడి పోయింది సింహళ. "అబ్బ ! అంత పెద్ద రచయిత నించి తనకి స్వయంగా జవాబు! తనెంత అదృష్టవంతురాలు" అనుకుంది మురిసి పోతూ. ఆ ఉత్తరాన్ని ముద్దులతో ముంచెత్తింది సింహళ.

తన వివరాలతో జవాబు కావాలట ! అబ్బ! నవలలాగే ఉత్తరాలుకూడా అమోఘంగా రాయ గలరు నవీన్‌బాబు— అనుకుంది మురిపెంగా.

వెంటనే కాగితం కలం తీసుకుంది.

శ్రీ నవీన్‌బాబుగారికి !

నమస్కారం. మీరు రాసిన ఉత్తరం ఇప్పుడే అందింది. మీరు లెటర్సు మీరే రాస్తారా? లేక సెక్రటరీచేత రాయించి సంతకం పెడతారా ఇన్నాళ్ళనించీ బుర్ర బద్దలు కొట్టుకుంటు న్నానంటే నమ్మండి. చివరకి మీరు మీ హస్తాలతో రాసిన ఉత్తరం చదివేసరికి నేనే చంద్రలోకం చుట్టి వచ్చాననుకున్నంత ఆనందం కలిగింది.

నేను బి. ఏ. పరీక్షరాసి రిజల్ట్సుకోసం వేచి వున్నాను. నాకు అన్నదమ్ములుగాని—అక్కచెల్లెళ్ళు గాని ఎవరూ లేరు. నేను ఒక్కత్తినే సంతానం మా అమ్మా నాన్నలకి—నాన్నగారు ఛీఫ్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నారు. అమ్మ నేను ఇంటికి తెచ్చే పత్రికలు, నవలలు చదువుతూ కులాసాగా కాలక్షేపం చేస్తుంటుంది. టూకీగా నా కథ ఇది— మరి మీ వివరాలు రాస్తారుగా! మీ లేఖకై చంద్రునికోసం ఎదురుచూచే చకోరంలా వేచి వుంటాను.

ఇట్లు,
సింహళాదేవి.

ఆ ఉత్తరం తనే పోస్టాఫీసుకు వెళ్ళి కవరు కొని పోస్టుచేసి వచ్చింది.

ఇప్పుడు సింహళాదేవికి స్వప్న కాని, సమత గాని దృష్టిలోకి రావడం లేదు.

ఆమె ఆలోచనలన్నీ నవీన్‌బాబు చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. నవీన్‌బాబు నించి అంద బోయే ఉత్తరాల మీదే వుంది ఆమె మనస్సు.

అతను తనకి నాలుగువందలనలభై లేక

# మారేడు దళం

నాలుగువందల నలభై నాలుగు — కిలోమీటర్ల దూరంలో వున్నాడు.

ఉత్తరం అందాలన్నా— రావాలన్నా ఆలస్యం అయిపోయిందంటే తనకి తిండి తిప్పలు నయిం చవు— అనుకుంది మనసులో దిగులుగా.

సింహళాదేవి నించి ఉత్తరం వెంటనే వస్తుందని నవీన్‌బాబు అనుకుంటూనే వున్నాడు. అలాగే తపీమని వచ్చింది. ఆ ఉత్తరం చూసి అతను చాలా సంతోషపడ్డాడు.

## బాధ 'పాట'గా ఉరికితే !

— రామసూరి

జీవితాల నిండా ప్రవహించే దుఃఖాన్ని
గుండెడు గుండెడు
పంచుకున్న ఏ తరాల కన్నీరో
ఈ తరాన్ని కదిలిస్తుంటే
నా తరం తోటని పలకరించే పాట
ఈ పూట పాడాలనిపిస్తోంది —
జనం కళ్ళ ఎడారిలో
పరచుకున్న నిరాశని తరిమేందుకు
ఏ కలల కోయిలలు గళాలు విప్పి
శిశిరంతో పోరాడతాయో
చూడాలనిపిస్తోంది —
లౌకిక ప్రపంచంలో
అలౌకిక విషయాలతో
వ్యాపారం చేసుకునే అతి లౌక్యంగాళ్ళు
జనం మౌఢ్యాన్ని
సొమ్ము చేసుకుంటుంటే
నా తోటలోకి
ఒక 'పాట' విసరాలని ఉంది —
వికసించటం నేరమని
చెట్లని గాలి కొరడాలతో శిక్షిస్తే
రాలిన ఈ పూలన్నీ
ఏ కొమ్మల కన్నీరో !
ఒక్కొక్క పువ్వు గుండె వేదనని
అక్షరంగా మార్చి
భావ చైతన్య సౌరభాలు
'పాట'గా వెదజల్లాలని ఉంది —
దేశంలో నదులన్నీ
అత్తవారి హింసలు భరించలేని
కోడళ్ల కళ్లలో ప్రవహిస్తుంటే
శిథిల సాంప్రదాయాలతో
పోరాడే నా తరం మందారాలు
రేపటి ఆశా సంగీతాన్ని
వినిపించటానికి
ఈ పూట ఆ 'పాట' రాయాలని ఉంది !!!
చైతన్య వసంతాన్ని ఆహ్వానించాలని ఉంది !!!

ఈ అమ్మాయి పేరు తనకి బాగా నచ్చింది. మరి అమ్మాయి ఎలా వుంటుందో!?

సింహళ పేరున్నది అంత అందంగానూ వుంటుందో లేక పగలు చూస్తే రాత్రి కలలోకి వచ్చే విధంగా వుంటుందో!

ఆ ఉత్తరం అతని అంచనాలకి సరిపోయి నట్లే వుంది. అందుకని అతనిలో హుషారు తలెత్తింది.

హ్యాండ్ రైటింగ్ బాగానే వుంది. మనిషి కూడా అందంగానే వుంటుందని వూహించవచ్చు అనుకున్నాడు నవీన్.

డియర్ సింహళాదేవి !

మీ ఉత్తరం నన్ను ఆనందడోలికల్లో వూగిస లాడించింది. మీరు ఫైనల్ బి. ఏ. పరీక్ష ఇచ్చి వచ్చానన్నారు. చాలా సంతోషం. మీరు ఫస్టున పాసవ్వాలి. నాకు పార్టీ ఇవ్వాలి. మీకు వీలైతే ఒక ఫొటో పంపిస్తారా మీది ?"

నవీన్.

ఆ ఉత్తరం అందినరోజునే తన దగ్గర నెగిటివ్ వుంటే కాపీ తీయించింది. ఆ పాస్‌పోర్టు ఫొటోతోపాటు లెటరు రాసి పడేసింది.

ఆ ఫొటో అందుకున్న నవీన్ సింహళ అందానికి ముగ్ధుడయిపోయాడు. నిజంగా చాలా అందంగా వుంది. ఫొటోలోనే ఇంత అందంగా వుంటే ముఖాముఖీ చూసినప్పుడు మరెంత అందంగా వుంటుందో అనుకున్నాడు పరవశంగా.

అతనలా ఈజీ ఛైర్‌లో వాలి సింహళని గురించి ఆలోచిస్తున్న సమయంలో లోపల్నించి అనూరాధ కంఠం వినిపించింది.

"ఏమండీ ! భోజనానికి రండి" అంటూ.

భార్య పిలుపుతో ఉలిక్కిపడి కవరు, ఫొటో అన్నీ దాచేసి లేచాడు.

డైనింగ్ టేబుల్‌మీద కంచాలు పెట్టి పదార్థాలన్నీ వడ్డిస్తోంది అనూరాధ.

ఆ సైడ్ పోజులో ఆమెని ఒకసారి పరిశీలనగా చూశాడు. అనూరాధ చాలా నలుపు క్రిందకే వస్తుంది. ఒకే ఒక ఆడపిల్లని కని ఇకపై బిడ్డల్ని కనని మొరాయించింది.

ఆ పిల్లకి కూడా పన్నెండేళ్ళు వచ్చాయి. ఇక తనకి పిల్లలు కలగరని అటు అనూరాధ, ఇటు నవీన్ కూడా నిశ్చయించుకున్నారు. ముందు పొట్ట బాగా వచ్చేసి ఎప్పుడు చూసినా ఏడు నెలల గర్భవతిలా కనిపిస్తూ వుంటుంది.

బాగా వళ్ళుకూడా రావడంతో సౌకుమార్యం లావణ్యం తగ్గినట్లే కనిస్తుంది.

అతనికి సింహళ ఫొటో గుర్తుకు వచ్చింది.

ఆ చిరునవ్వు ముఖంలో ఎంత సమ్మోహనా శక్తి వుంది ? అని అనుకున్నాడు నవీన్.

"ఏమిటి మరీ పరధ్యానంలో పడిపోయారు— కలుపుకోండి. నెయ్యి వేస్తాను." అంటూ

# వేమన పద్యాలు




రాజు మాటలవలె రసికుడాడగవలె
వెంతవనికినైన నెగరరాదు
కదిపి యెగిరెనేవి గ్రహసమానముగాదె
విశ్వదాభిరామ వినుర వేమ.

అనూరాధ మరోసారి హెచ్చరించడంతో ఈ లోకంలోకి వచ్చినట్లయి గబగబా కలుపుకొన్నాడు

అన్నం అంతా మూడే నిముషాల్లో తినేసి గబ గబా గదిలోకి వెళ్ళిపోయాడు

## మారేడు దళం

"ఏమిటీమధ్య ఈయన మరీ మందమతిలా తయారయ్యారు ?" అని అనుకుంది అనూరాధ

"ఏదన్నా కొత్త నవల రాస్తున్నాడంటే దానికి శ్రీకారం చుట్టినట్టు ఎక్కడా కనిపించ లేదు. మరి ఏమిటీయన ధోరణి ?" అని అను కుంటూ తనూ భోజనం కానిచ్చి లేచింది అనూరాధ

అతని మనస్సంతా నవల రాయాలనీ లేదు. పడుతున్న నవలల మీదా లేదు సింహళాదేవి ముగ్ధమనోహరరూపం మీదే వుంది. ఒకసారి ఆమెను రప్పించగలగాలి మద్రాసు. అప్పుడుగాని తన తపన తీరేటట్లు లేదు— అనుకున్నాడు సింహళాదేవి ఫొటో మరోసారి చూసుకుంటూ.

అతనికా వూహ రాగానే ఎక్కడా కాలు నిలవనీయలేదు వెంటనే కాగితం కలం తీసుకుని గబగబా లెటరు రాశాడు

డియర్ సింహళాదేవి !

నీ ఫొటో చూస్తుంటే నాకు బ్రహ్మానందం కలిగింది. ఇంత అందమైన సుందరి నా అభిమాని కావడం నా అదృష్టం. నీకు వీలైతే ఒకసారి మద్రాసు రా ! నువ్వు ఏ రోజు ఏ బండిలో వచ్చేదీ నాకు లెటరు రాస్తే నేను స్టేషనుకు వస్తాను తప్పక వస్తావు గదూ !

ఇట్లు
నవీన్

ఆ ఉత్తరం అందుకున్న సింహళ హృదయం ఆనందతరంగ మాలికా డోలికల్లో వూగులాడింది.

తన వుహాలోకపు నవమన్మధుని నుంచి తనకు ఆహ్వానం ! ఏమైనా సరే తను తప్పకుండా మద్రాసు వెళ్ళితీరాలి

అదీ మందీ మార్బలంతో కాదు ఒంటరిగా వెళ్ళగలగాలి— అప్పుడక్కడ అతని దివ్యమంగళ విగ్రహాన్ని తనివి తీరా చూసుకోవాలి మనసారా మాట్లాడుకోవాలి. ఆ శుభఘడియలు ఎప్పుడు— ఎలా వస్తాయో తనకి ఊహాతీతం, అనుకుంటూ పరవశించిపోతోంది సింహళ

ఆమెకసలు నవీన్ నించి ఉత్తరం అందినప్పటినించీ కలల్లో జీవించడమే ఎక్కువయి పోయింది. అలాంటిది అతను రమ్మని ఆహ్వానం అందించే సరికి తనకి పూర్తిగా బాహ్యస్మృతి కోల్పోయినట్లయింది రమ్మని అతను రాసిన ఉత్తరమే తనకి ఇంత మత్తెక్కిస్తుంటే ముఖాముఖీ చూసుకుంటే ఎలా వుంటుందో— అనుకుంది గాలిలో తేలిపోతూ.

ఇప్పుడామె కళ్ళకి తన మిత్రురాండ్రెవరూ కనిపించడం లేదు. ఒకప్పుడు కూడా తిరిగిన వారంతా ఇప్పుడామె దృష్టిలోంచి కనుమరుగై పోయారు.

ఎంతసేపూ నవీన్‌బాబు నించి వచ్చే జవాబు—తను దానికి రాయబోయే మరో జవాబు, ఇవే ఆమెకి కావలసింది

ఇప్పుడామెకి తన రిజల్ట్సు మీద కూడా ఆత్రుతలేదు.

**(ఇంకా వుంది)**

# ఆనాడూ ఈ నాడూ కొందరి చర్మ సౌందర్యం ఒక్కటే!






పియర్స్—అసలైన గ్లిసరిన్ సబ్బు

మీ చర్మానికి ఆ మృదువైన సంరక్షణ ఇవ్వండి— పియర్స్‌తో. సబ్బు తయారు చెయ్యడంలో ఓ శతాబ్దపు అనుభవం స్ఫటికం లాంటి ఆ ప్రతి సబ్బు బిళ్లలోనూ ఇమిడి వుంది. పియర్స్ ఎంతో సున్నితమైనది. మరెంతో శుద్ధమైనది— దానిలోంచి మీరు చూడగలంతగా!

## పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా, సుకుమారంగా ఉంచుతుంది.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS-56 (R) 2317 TL




# ఆవేదన

— దిలావర్

**1**

బతుకు కబ్బుర్లలో
కలల కాబరే డాన్సులతో
కన్నుల బ్రీఫ్‌కేసుల నిండా
వెన్నెల నోట్ల కట్టలతో
హృదయం సీషోర్‌లో
అ (తి) నాగరికత అర్ధనగ్న ఆలోచనల గంతులతో
'అందాల' స్టేట్స్‌కు ఎగిరే
ఊహాల విమానాల్లో
కళ్లకు తగిలించుకున్న
ఖరీదయిన గుడ్డితనంతో
మబ్బుల్లో చంద్రుడిలా వెలిగిపోయే
ఈ మనోవ్యాపారులకేం తెలుసు ?
ఆ వెలుతురు నీడకింద
మరో లోకం వుందని !

**2**

బతుకు ఫుట్‌పాత్‌లమీద
దరిద్రాన్ని పరచుకొని
కాలేకడుపుల గారాబజానా !
కంతలుపడ్డ ఆశయాల కప్పుకింద
కూలుతున్న ఆశల గోడల్లో
గుండెల గుడిసెల రిక్షా !
ఆకలి మంటలకు తట్టుకోలేక
చీకటి మంటల్లో కాలిపోతూ
పాపాల రూపాలకు వూపిరిపోస్తూ 'కన్నతల్లులు !'
ఏ అనామక పంకంలోనో పుట్టి
సంపన్న కిరణాలవేపు
దీనంగా రేకులు చాపుతూ
దిక్కులేని తమ్మిమొగ్గలు !
ఈ బతుకుల చెత్తకుండీలో పడ్డ
రోజుల చెత్తాచెదారాన్ని
తాపీగా నములుతూ
కాలం గాడిద ,

**3**

బతుకు ఆఫీసుల్లో
సమస్యల ఫైళ్లకే నిరంతరం అతుక్కుపోయినా
అప్పుడప్పుడూ
బయటి లోకాన్ని కూడా
భయం భయంగా తొంగి చూసే సగటు కళ్ళు,
ఫుట్‌పాత్‌ల మీద ఎదురయ్యే
చితికిన ఎత్తుపళ్లాల్లోక
ఓ సానుభూతి పావలా కాసు విసిరేసి
సంతృప్తిని కొనుక్కుందామనుకుంటాయి
తీరా గుండె జేబును తడిమినప్పుడు గానీ తెలీదు —
చిరుగుల జేబులో ఏమీ వుండవని !
ఆ చేదు నిజం జుట్టు పీక్కుంటూ
ఏ మానవతా సముద్రతీరానికో పరుగులు తీస్తే —
అక్కడ మాత్రం ఏముంటుందని
చెలియలికట్ట దాటలేక
గుండెలు బాదుకునే అలలు తప్ప ?



'వీరభద్రుడు'లో విజయశాంతి, కార్తిక్

## "వీరభద్రుడు"లో ప్రేమకు ప్రాణమిచ్చే మనసున్న మొరటోడు

తొందరబాటుతో తమ్ముడు భద్రుడు (మాగాల రంగారావు) మీద చెయ్యి చేసుకున్నందుకు పార్వతి (అన్నపూర్ణ) ఎంతగానో బాధపడిపోయింది ఇంతలో ఆమె కూతురు లక్ష్మి (విజయశాంతి) వచ్చి, "ఏంటమ్మా, చీకట్లో కూర్చున్నావ్? రా – అన్నం తిందాం," అంది

"నాకు ఆకలి కావడంలేదు," అంది పార్వతి

"ఎకెందుకు ఆకలి వేయడంలేదో నాకూ తెలుసులే! చెట్టంత మనిషిని — చెంప ఛెళ్ మనిపించావ్ నీ దెబ్బతో పులిలాంటి మామయ్య పిల్లయిపోయాడు"

"అదేనే నా బాధ ఏనాడూ చెయి చేసుకుని ఎరుగను పాపిష్టిదాన్ని"

"ఏంటమ్మా? ఆ పసిబిడ్డ కోసం ఏడుస్తున్నావా? సర్లే నే వెళ్లి తింటాను ఆకలేస్తే తనే వస్తాడు," అంటూ గుమ్మం వరకు వెళ్లిన లక్ష్మి అక్కడ భద్రుడ్నిచూసి, ముసిముసిగా నవ్వింది "అమ్మోయ్! చూడు— ఎవరొచ్చారో! నేనన్నానా — ఆకలేస్తే తనే వస్తాడని?" అంది

భద్రుడు దీనంగా పార్వతివంక చూస్తూ, "నేనేం ఆకలేసిరాలేదు నేను లేకపోతే మా అక్క అన్నం తినదని వచ్చాను అంతే!" అన్నాడు

"మావయ్యా! దవడ వాసిందా?" చిలిపిగా చూసింది లక్ష్మి

"ఛీ – ఫో! కొట్టినా పెట్టినా మా అక్కకే హక్కుంది రా, అక్కా, అన్నం పెడుదువుగాని" అంటూ భద్రుడు వెళ్లి, పార్వతి ఎదురుగా కూర్చున్నాడు

కందిపోయిన అతని చెంపను చూసేసరికి పార్వతి మనసు చివుక్కుమంది

ఆ గ్రామంలో బక్కవాళ్లకు దేవుడుగా, బలసినవాళ్ళకు పక్కలో బల్లెంగా మాదాల రంగారావు విలక్షణమైన పాత్రను నిర్వహించిన "వీరభద్రుడు" చిత్రాన్ని పివి శెట్టి రవిరాజ్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జె కె ఫిలిమ్స్ అధినేత జయకృష్ణ ఉత్కృష్టమంగా నిర్మించారు మురళి, జ్యోతి, నర్రా, పి ఎల్ నారాయణ, అన్నపూర్ణ, ధనశ్రీ, శ్రీరాజ్, ఏమారి, జవ్వాది, చిగతల అప్పారావు, నారాయణమూర్తి, సిలోన్ మనోహర్, గిరగ ఇతర భూమికలు నిర్వహించారు పివి శెట్టి సంభాషణలు, ఇళయరాజా సంగీతం, కోటేశ్వరరావు ఛాయ, చౌదుల సుబ్బారావు కూర్పుతో రామారావు, యోగానంద్ నిర్వహణ బాధ్యతలు వహించారు జనవరి విడుదల

## "సుందరి – సుబ్బారావు"

"ప్రేమించిన సుందరిని పెళ్ళాడ్డానికి అష్టకష్టాలుపడిన అమాయక ప్రాణి సుబ్బారావు కథ," అన్నారు రేలంగి నరసింహారావు ఈయన దర్శకత్వం నెఱపే ఉషాకిరణ్ మూవీస్ "సుందరి–సుబ్బారావు" చిత్రంలో విజయశాంతి, చంద్రమోహన్, వీరభద్రరావు, సాక్షిరంగారావు, రావి కొండలరావు, వంకాయల, హేమసుందర్, పి జె శర్మ, బాలాజీ, చిట్టిబాబు, రాజ్యలక్ష్మి, లక్ష్మిచిత్ర, ఆనంది నటిస్తున్నారు జి కృష్ణమూర్తి కథకు ఆదివిష్ణు సంభాషణల కర్త వేటూరి, కోపెల్ల శివరాం గీతాలకు సత్యం బాణీలు కూర్చారు కోటేశ్వరరావు ఛాయ, భాస్కరరాజు శిల్పం, రాజగోపాల్ కూర్పుతో రామోజీరావు నిర్మాత "అన్నపూర్ణా స్టూడియోలో డిసెంబర్ 26 నుంచి జనవరి 31 వరకు ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది,' అన్నారు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ మిక్కిలినేని జగదీష్‌బాబు

శారద 'చదరంగం'



## సినిమా

### మాదాలతో జి రామినీడు దర్శకత్వంలో తమిళంలో పాత్రికేయుడు నిర్మించే "యువతరం"

''మాదాల రంగారావులదేపాత్రనుతమిళంలో ధరిస్తున్నారు రాజ్యలక్ష్మి, శ్రీలత, వై విజయ, నాగేష్, రాజేష్, విజయకుమారి తక్కిన పాత్రలు ధరిస్తున్నారు,'' అన్నారు పాత్రికేయుడు, తెలుగు సినిమారంగంతో చిరకాల సంబంధ బాంధవ్యాలు గల కె వి ఆర్ మూర్తి తమిళ చిత్రం పేరు ''శంఖనాదం'' ఇళయరాజా సంగీత దర్శకుడు



'ఈ చదువులు మాకొద్దు'లో రంగనాథ్, అన్నపూర్ణ



'మేమూ మీలాంటి మనుషులమే'లో దీప

### "ఈ చదువులు మాకొద్దు"లో నిరుద్యోగపర్వం

విగ్రహాలవద్ద ఉంచిన కవర్‌ను భవాని (అన్నపూర్ణ) తీసి, అరవింద్ (రంగనాథ్)కు అందిస్తూ,'' ఈ సారి తప్పకుండా నీకు ఉద్యోగం వస్తుందిరా,'' అంది

అరవింద్ బాధగా నవ్వాడు ''అమ్మా, ప్రతిసారీ నువ్విలాగే దేవుడి పాదాల దగ్గర పెట్టి ఇస్తున్నావు. నేను పోస్ట్ చేస్తూనే ఉన్నాను ఇంటర్‌వ్యూలే తప్ప ఉద్యోగం రాలేదు కదమ్మా? ఇదికూడా అంతేనేమో ! అన్నాడు

''తథాస్తు దేవతలుంటారు అలా అన కూడదు, బాబూ !'' అంది భవాని

అరవింద్ బయలుదేరబోయేసరికి తుసుక్కున తుమ్మాడు పక్కనున్న కాళి భవానికి గుండె ఆగినంతపనైంది ''ఆపుకోలేవురా, వెధవా ?'' అంది.

''నా శక్తికొలదీ నాసికా రంధ్రములను బిగించితిని అయిననూ ఓడితిని, మాతా ! క్షమసత్వము క్షమసత్వము !'' అన్నాడు కాళి

''వెళ్లొస్తానమ్మా !'' అంటూ భారంగా అంగలువేస్తూ బయలుదేరాడు అరవింద్

వేజెళ్ళ సత్యనారాయణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అట్లూరి దుర్గాప్రసాద్ సమర్పించే శ్రీ వెంకటదుర్గా ఇంటర్నేషనల్ వారి ''ఈ చదువులు మాకొద్దు'' చిత్రానికి అట్లూరి వెంకటేశ్వరరావు నిర్మాత

### కె. భాగ్యరాజ్ రచన, దర్శకత్వంలో శ్రీపారథీ స్టూడియోస్ 17వ చిత్రం

''జనవరిలో ప్రారంభిస్తున్నాం,'' అన్నారు శశిభూషణ్ ఈయన నిర్మించే చిత్రానికి రచన, దర్శకత్వంతోపాటు తొలిసారిగా తెలుగులో కథానాయకుని పాత్రను నిర్వహిస్తారు కె భాగ్యరాజ్

## "దేవాంతకుడు" లో
## ఆకతాయి అబ్బాయి

కాలేజ్‌లో క్లాస్‌లేని విరామ సమయంలో శాంతి (విజయశాంతి) బుద్ధిగా చదువుకుంటూ కూర్చొనుంది.

మేసేగాడిద దగ్గరికి కూసేగాడిద అన్న సామెతగా ఆకతాయి అయిన అరుణ్ (హరి) వచ్చాడక్కడికి. అదేదో ఘనకార్యమన్నట్లుగా ''శాంతీ, నేనొచ్చాను,'' అన్నాడు కూడా.

''సారీ, అరుణ్! బాండ్ మేళంతో స్వాగతం చెబుదామనుకుంటే, సన్నాయివాడు పోతిచ్చాడు. దట్స్ యువర్ బాడ్ లక్!'' అంది శాంతి.

''డోంట్ బీ సిల్లీ... శాంతీ, నిన్ను నేను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను.''

''అరే! నువ్వూ మంచి జోక్స్ వేస్తూంటావే అప్పుడప్పుడు?''



విజయశాంతి 'దేవాంతకుడు'లో

అరుణ్ ముఖం కందిపోయింది. ''శాంతీ, వాట్ నాన్సెన్స్ యు ఆర్ టాకింగ్?''

''ఐయామ్ వెరీమచ్ ఇన్ ది సెన్స్. ఐ థింక్ యుహేవ్ లాస్ట్ యువర్ సెన్స్. లేకపోతే, నువ్వు నన్ను పెళ్ళి చేసుకోవడమేమిటి?'' శాంతి తీక్షణంగానే చూసింది.

''నాకేం తక్కువైంది? అందం ఉంది. ఆస్తి ఉంది హోటలుంది. ఫైట్స్ కూడా వచ్చు నాకేం లేదంటావ్?''

''బుద్ధి లేదంటాను. అదెక్కడో పారేసుకుని ఉంటావ్ వెతికి పట్టుకుని, వేరే అమ్మాయిని ట్రై చెయ్!''

ముఖంమీద చాచిపెట్టి కొట్టలేదు గాని, అంతపని చేసి వెళ్లిన శాంతి వైపు క్రోధంగా చూస్తూండి పోయాడు అరుణ్. చిరంజీవి కథానాయకుడుగా ఎస్. వి. చంద్రశేఖర్ దర్శకత్వంలో నారాయణరావు నటిస్తూ, నిర్మించే



'తాండవ కృష్ణుడు' అక్కినేని నాగేశ్వరరావు, అరుణ, అత్తిలి లక్ష్మి

దమయంతి ఆర్ట్ పిక్చర్స్ ''దేవాంతకుడు'' లో గుమ్మడి, గొల్లపూడి, చిట్టిబాబు, రోహిణి, అన్నపూర్ణ, వరలక్ష్మి ఇతర పాత్రధారులు. శ్రీమతి శోభ కథను మధు సంభాషణలకర్త, జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు. కేశవన్ ఛాయాగ్రాహకుడు.

## "తాండవ కృష్ణుడు"లో
## రాబందుల తాండవం

ప్రొఫెసర్ చక్రవర్తి (ఎ. ఎన్. ఆర్)ని, వాణి (జయప్రద) తన భర్తగా బంగళాలోకి తీసుకొచ్చింది. వాణి గార్డియన్‌లుగా ఉంటూ కంటిరెప్పలా వాణి ఆస్తిని కాపాడుతున్న పెద్దల ఒప్పందంతోనే ఆ పెళ్ళి జరిగింది. తాత రాసిన వీలునామా ప్రకారం పెళ్ళయ్యాక రావలసిన ఆస్తి మొత్తం వాణికి దక్కింది. ఆ ఆస్తిని చేజిక్కించుకోవాలని భానుమూర్తి (సత్యనారాయణ), రామచంద్రయ్య (అల్లు రామలింగయ్య) తాపత్రయం. వాళ్ళు హఠాత్తుగా తన ఇంటికి రాగానే, ''ఏం గుంటనక్కల్లూ, ఇక్కడికొచ్చారు?'' అన్నాడు చక్రవర్తి. ''మీ భార్య పంపింది. విడాకులు

'ఇద్దరు దొంగలు'లో సత్యనారాయణ, శారద, కృష్ణ, శోభన్‌బాబు



# సినిమా

ఇస్తావా, ఇవ్వవా ?'' అని అడిగారిద్దరూ.

''ఇవ్వను,'' అన్నాడు చక్రవర్తి.

''ఇవ్వకపోతే కోర్టు చూస్తూ ఊరుకుంటుం దనుకున్నావా ? నువ్వు తనను అవమానపరిచావని, తనకు పిచ్చెక్కిందని స్వహస్తాలతో రాసిచ్చి పిచ్చాసుపత్రిపాలు చేశావని, ఆస్తి కాజేయడం కోసమే ఇలా నాటకాలాడుతున్నావని చెప్పి దావా వేసింది,'' అన్నాడు రామచంద్రయ్య.

''అబద్ధం !'' అన్నాడు చక్రవర్తి.

''నిజమే దానికి పిచ్చెక్కని మాట నిజం నీ చెల్లెలు నా కొడుకు గిరి మూలంగానే మోసపోయిందన్న మాట నిజం. కాని, ఈ నిజాలన్నీ మేం ఒప్పుకోమే,'' అన్నాడు భానుమూర్తి.

''అందుకే — ఈ దస్తావేజులమీద సంతకం పెట్టు. పిచ్చిది అని నీ పేరుమీద నాటకమాడి ఆసుపత్రిపాలు చేసిన నీ భార్య మళ్ళీ నీకు తిరిగి వస్తుంది,'' అన్నాడు రామచంద్రయ్య.

''నీ చెల్లెలు నా కోడలుగా మళ్ళీ తిరిగి వస్తుంది,'' అన్నాడు భానుమూర్తి.

వాళ్ళిద్దరి వంక చక్రవర్తి చురచుర చూశాడు

''తేల్చుకో... చెల్లెలి కాపురం చక్కదిద్దుకుంటావో లేక చేజేతులా నరకం చేసుకుంటావో నీ ఇష్టం,'' అంటూ రామచంద్రయ్య కాగితాలను అక్కడ పడేస్తూ, ''నీ భార్యచేత నోటీసు అని చెప్పి, ఆస్తి దస్తావేజులమీద మేం సంతకం పెట్టించుకున్నాం,'' అని భానుమూర్తితో వడివడిగా బయలుదేరాడు.

''చిచ్చు రగిలి, చిక్కులపాలై, చిందర వందరగా తయారైన సంసారాన్ని నేర్పుతో గట్టెక్కించె పాత్రలో నాగేశ్వరరావుగారు అపూర్వంగా నటించారు,'' అన్నారు పి. చంద్రశేఖర రెడ్డి. ఈయన దర్శకత్వంలో బి. గోపాలరెడ్డి నిర్మించిన కృష్ణా ఆర్ట్ క్రియేషన్స్ ''తాండవ కృష్ణుడు'' చిత్రం జనవరి విడుదల. గొల్లపూడి, గిరిబాబు, రాజేంద్రప్రసాద్, కాంతారావు, శ్యామలగౌరి, అన్నపూర్ణ, అత్తిలి లక్ష్మి, మిక్కిలినేని, సి హెచ్. కృష్ణమూర్తి ఇతర పాత్రధారులు పరుచూరి సోదరుల సంభాషణలు, వేటూరి — గోపి గీతాలు, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, చక్రవర్తి సంగీతం, బి. నలం శిల్పం, అంకిరెడ్డి కూర్పుతో డి. ఆర్. చెన్నారెడ్డి కథ సమకూర్చి, నిర్మాణ సారథ్యం వహించారు.

## ''జేమ్స్‌బాండ్ 999''

''సరికొత్త పంథాలో ఎలెక్ట్రానిక్స్ పరికరాలెన్నింటినో మా చిత్రంలో ప్రవేశపెడుతున్నాం డిసెంబర్ 20 నుంచి 25 వరకు తడ, కైలాస కోన ప్రాంతాల్లో కొన్ని ప్రధాన సన్నివేశాలను పూర్తి చేశాం. జనవరిలో రాజమండ్రి, విశాఖపట్నం పరిసరాలలో 25 రోజుల పాటు నిర్విరామంగా షూటింగ్ జరుపుతాం,'' అన్నారు ఎస్. వి. సుబ్బరాజు. ఈయన కథ సమకూర్చి, సమర్పించే శ్రీ వాణీ ఆర్ట్స్ ''జేమ్స్‌బాండ్ 999'' చిత్రంలో సుమన్, భానుప్రియ, గొల్లపూడి, సుదర్శన్, జయమాలిని వగైరా తారాగణం. శ్రీనివాసరెడ్డి సంభాషణలు, రాజు—కోటి సంగీతం, ఎస్. ఎస్. రాజు ఛాయ, మోహన్‌రెడ్డి నిర్వహణలో వి. ఎస్. రంగనాథ వర్మ నిర్మాత — ''ఉగాదికి విడుదలవుతుంది,'' అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే పి. చంద్రశేఖరరెడ్డి.



''హీరోయిన్లకు బాగా కరువుగా వుందన్నారు గదా—అందుకని స్త్రీ పాత్ర లేని స్క్రిప్టు తయారు చేసా సార్ !''

## ''మూడు ముళ్ళు'' తమిళం నుంచి తెలుగుకు డబ్బింగ్ !

''మూడు ముళ్ళు'' చిత్రానికి మాతృక అయిన ''ముందానై ముడిచ్చు'' చిత్రాన్ని ఎ. వి. ఎం. ప్రొడక్షన్స్‌వారు తెలుగులో డబ్ చేయడానికి సంప్రయించారు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, ప్రధాన పాత్ర నిర్వహించిన కె. భాగ్యరాజ్ సరసన ఊర్వశి, దీప నటించారు

## కె. ఎస్. రామిరెడ్డి డైరెక్షన్‌లో చంద్రమోహన్, రాధిక

''ప్రేమను అమ్ముకున్న అమ్మ, ప్రేమను నమ్ముకున్న కూతురు వీరిద్దరి మధ్య జరిగే సంఘర్షణ ప్రధానాంశం కథ పి కనకాంబర రాజుది,'' అన్నారు కె ఎస్ రామిరెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శోభబాబు నిర్మించే యూనిస్ పిక్చర్స్ వారి తొలి చిత్రంలో చంద్రమోహన్, రాధిక, గొల్లపూడి మారుతీరావు, అన్నపూర్ణ ఆదిగాగల వారుంటారు. హైదరాబాద్‌లో ఫిబ్రవరి 15 నుంచి మార్చి 15 వరకు ఒకే షెడ్యూల్లో చిత్రీకరణ పూర్తవుతుంది. వేటూరి, సి. నారాయణరెడ్డి గీతాలకు మహదేవన్ స్వరకర్త. బి. ఎ. జోగ్ ఛాయ, తరణి శిల్పం, ఎం. ఎస్. మణి కూర్పు, ఎం. ఎస్. నారాయణరాజు సహదర్శకత్వం నిర్వహిస్తారు.

జయసుధ, జయప్రద సారథి 'యుద్ధం'లో



# ఛాయాగ్రహణం: నాడు - నేడు

## యస్.యస్. లాల్



## నాడు :

చీకటి పడింది. వెలగచెట్టు కింద, సత్రం అరుగుమీద ఓ సన్యాసి "సున్నా సున్నా కూడుకుంటే సున్నేరా, జంగం జంగం రాసుకుంటే బూడిదేరా" అని పాడుకుంటున్నాడు.

ఆ సన్యాసి ఎవరో కాదు. ఈనాటి రాజయోగి, ముఖ్యమంత్రి మన అన్నగారైన శ్రీ ఎన్. టి. ఆర్. ! అది సత్రం అరుగుకాదు. రాజ్యం పిక్చర్స్‌వారు 'దాసి' చిత్రం కోసం వేసుకున్న సెట్టు. వెలగచెట్టు యీపాటికి చాలా మందికి తెలిసిపోయే వుంటుంది; అది శోభనాచల స్టూడియోలో అన్నార్తులపాలిట కల్పవృక్షం.

దాదాపు ఆ రోజు షూటింగ్‌కు రావలసిన నిర్మాత శ్రీమతి లక్ష్మీరాజ్యం, దర్శకుడు శ్రీ రంగనాథదాసుగారు, ఛాయాగ్రాహకుడు జనాబ్ రహిమాన్‌గారు అందరూ వచ్చేశారు. అన్నగారు పాట రిహార్సల్స్ చేసుకుంటున్నారు. ఇంకా లైట్లు వెలగడంలేదు. నిర్మాత కారణం అడిగారు. రహిమాన్‌గారు తన అసిస్టెంటు కే.శే. మధు రాలేదని చెప్పారు. ఇక ప్రొడక్షన్ మేనేజరు మధు కోసం వేట ప్రారంభించాడు. ఇంట్లో సినిమాకు వెళ్ళినట్లు తెలిసింది. రాక్సీ, మినర్వా, మిడ్‌లాండ్ అన్ని థియేటర్లలో మధు కోసం గాలించడం జరిగింది. పత్తా లేదు. చివరికి రాత్రి తొమ్మిదింటికి క్లబులో వున్నట్లు తెలిసి పట్టుకొచ్చారు.

అంటే, దాదాపు మూడు గంటలు అసిస్టెంటు రాకపోవటం వల్ల అందరూ వచ్చినా షూటింగ్ జరగలేదు అది నాడు

## నేడు :

సాయంత్రం అయిదున్నరైంది చినుకులు పడుతున్నాయి నేను ఇంట్లో ప్రొడక్షన్ కారు కోసం కాచుకొని కూర్చున్నాను చివరికి ఆరున్నరకి కారొచ్చింది ఆదుర్దాగా లోపల కూర్చున్నాను ఇంజన్ స్టార్టు కాలేదు కొంత దూరం నెట్టిచూశాం మొండికెత్తింది ఇక లాభం లేదనుకొని వాహనం కోసం రోడ్డుమీదికి పరుగుతీశాను ఎవడూ స్టూడియో వేపు రానంటున్నాడు చివరికి రెట్టింపు కిరాయి యిస్తాను, నీవి చేతులు కాదంటే సరేనన్నాడు సరిగ్గా ఏడుంబావు అవుతుంది ఫ్లోరు దగ్గరికి చేరుకునేసరికి అందరూ బయటికి వచ్చేస్తున్నారు ఏమిటని అడిగాను షూటింగ్ అయిపోయిందన్నారు నేను లేను కదా అని మళ్ళీ అడిగాను. పాత్రధారులు వెళ్ళిపోవాలి, కాబట్టి యిక్కడున్న అసిస్టెంటుచేత చేయించేశాం అన్నారు. ఇది నేటి నిజం.

నాటికి నేటికి ఎన్నో మార్పులు వచ్చాయి. ఇంకా వస్తున్నాయి. ముఖ్యంగా ఛాయాగ్రహణంలో సాంకేతికంగా జరిగిన అభివృద్ధి మరే ఇతర శాఖలోనూ జరగలేదు. నలుగురు వ్యక్తులు చాలా కష్టపడి ఎత్తలేని డెబ్రీకెమేరా పోయింది ఒక మనిషి ఎత్తగల మిచెల్ కెమేరా వచ్చింది అదీ ఇప్పుడు కనిపించడంలేదు పదేళ్ళ కుర్రాడు సునాయాసంగా మోసుకుపోయే ఏ రిఫ్లెక్స్ కెమేరా వచ్చింది జూమ్ లెన్స్ వచ్చింది దీనివల్ల తక్కువ జనాభాతో స్వల్ప వ్యవధిలో ఎక్కువ ఫుటేజీ కవర్ చెయ్యవచ్చు

'మొబిలిటీ' స్టూడియో ఆర్టిఫిషియల్ వాతావరణాన్ని వదిలి యీనాటి ఛాయాగ్రాహకుడు జీవితానికి దగ్గరగా రాగలుగుతున్నాడు

నేను విశాఖపట్నంలో స్టూడియో ప్రమేయం లేకుండా అంతా కొత్తవాళ్ళతో, ఇళ్ళల్లో సినిమా తియ్యడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది ఇది సినిమాయేనా అని చాలామంది అడిగారు కొంతమంది తమాషా అనుకున్నారు ఆర్టిస్టులు ఎవైలబుల్‌గావుండి, టెక్నీషియన్‌కి కాస్త ఆలోచించుకునే వ్యవధి వుంటే తన టాలెంట్ ఎలా నిరూపించుకోగలడో యీ చిత్రం రుజువు చేసింది ఆ తరువాత అందరూ ఇళ్ళల్లో తియ్యడం మొదలుపెట్టారు సబ్సిడీ ముసుగుతో ఇరవై ముప్ఫై రోజుల్లో చిత్రాలు చిటపటకాయల్లా తయారయిపోతున్నాయి

అంతా స్పీడు యుగం ఇది. ఈనాడు కథ లేకుండా ఏవో రెండు ట్యూన్లు రికార్డు చేసుకొని షూటింగ్ ప్రారంభించవచ్చు. పాటలు తీస్తూ కథ రాసుకోవచ్చు. సెట్లో డైలాగులు రాసుకోవచ్చు. సినిమా పూర్తికాకుండా లీడర్స్ వేసుకొని రీ రికార్డింగ్ చేసుకోవచ్చు. అంతదూరం ఎందుకు హీరో కాల్‌షీట్స్ యిస్తే అసలు డబ్బులేకుండా సినిమా తీసెయ్యవచ్చు. అంతా మిథ్య !

మా గురువులు ప్రతీ వస్తువు అందంగ కనిపించాలని, ప్రేక్షకుడి కంటికి జర్క్ లేకుండా కథ చెప్పాలని ప్రయత్నించేవాళ్ళు. ఈ తరం వాళ్ళు వస్తువును దాని పరిధిలోనే, వున్నది వున్నట్లు చూపించాలంటున్నారు. కొందరికి జర్క్‌మీద మోజు. ప్రేక్షకుల కళ్ళను పాడుచేసి తెరమీద వున్నది ఎవరో కనిపించకుండా రంగులతో 'గ్లేరు'తో గలాటా చెయ్యడం సరదా.

ఆ రోజుల్లో ఉదయం పది దాటితే టాప్ లైట్ అని ఔట్-డోర్ షూటింగ్ ఆపేసేవాళ్ళు. ఇప్పుడు టాప్ లైట్‌లోనే షూటింగు ఆరంభమవుతుంది. మేకప్ విషయంలోనూ అందరికీ భక్తిశ్రద్ధ కనిపించేవి. ఏ ఆర్టిస్టయినా మేకప్‌తో కెమేరామన్ దగ్గరికి వచ్చి ఓ. కే. చేయించుకొని కెమేరా ముందుకొచ్చేవారు. ఇక క్లోజప్ అంటే గంటలతరబడి అలా నిలబడిపోయేవారు. అంతా క్రమశిక్షణతో జరిగేవి.

నాను ఛాయాగ్రహకుడిగా ప్రమోషన్ వచ్చిన తొలిరోజు కీ శే టి ఆర్ సుందరం సెట్టుకు వెళ్ళబోయేముందు నాకెదురు వచ్చి 'ఎక్కడికెళ్తున్నావ్ ?' అన్నారు 'సెట్టుకి' అన్నా టూకీగా 'కాదు దేవుడి గుడికి సెట్లో కాలుపెట్టేముందు అదే నీ దేవాలయం అనుకో కెమేరా నీ దైవం' అని భుజం తట్టారు ఆ ఆశీర్వాదబలంతో దాదాపు వంద చిత్రాలకు పని చేసే భాగ్యం నాకు కలిగింది

కీ శే టి ఆర్ సుందరంగారి మోడరన్ థియేటర్స్ ఒక శిక్షణాలయం ఆ స్టూడియో నుంచే డబ్ల్యు ఆర్ సుబ్బారావు, జి కె రాము, జె జె విజయం, మస్తాన్, జి ఆర్ నాథన్, సుందరబాబు మొదలైన ఛాయాగ్రాహకులు, ఆ సైతం బి కరుణానిధి, కణ్ణదాసన్ వంటి రచయితలు, ఎంతోమంది దర్శకులు, నటీనటులు, కళాకారులకు పుట్టిల్లు అయింది షూటింగ్ లేని సమయాల్లో మాకు మంచి ఇంగ్లీషు సినిమాలు చూపించడం, కొన్ని

సమన్వయిచ్చి షాట్స్ తియ్యమనడం జరిగేది. ఇండియాలో మొట్టమొదట ద్విపాత్రాభినయం తీసిన ఘనత వారికే దక్కింది ఛాయా గ్రాహకుడు బోడోగూడ్స్‌వాకర్ అనే జర్మన్ జాతీయుడు

చాలామంది తరచు నన్నొక ప్రశ్న అడుగుతూ వుంటారు మన సినిమాలు ఇంగ్లీషు ఫిలింస్‌లా ఎందుకు వుండవని ఇందుకు మొదటి కారణం ఇక్విప్‌మెంటు, సినావిషన్ వంటి కెమేరాలు, కంప్యూటరైజ్డ్ మోషన్ కంట్రోల్ యానిమేషన్ను మన దేశం ఎప్పుడొస్తాయో కలగా వుంది లాబరేటరీలో మనం వాడే కెమికల్స్ చాలా లో గ్రేడ్‌లో వుండటం మన ఎట్మాస్ఫియర్‌లో చాలా డస్ట్, పొల్యూషన్, అల్ట్రావైలెట్ రేస్ వుండటం కారణం

దానికితోడు నేటి ఛాయాగ్రాహకుడు ఏదీ అవగాహన కాని స్థితిలో వున్నాడు అతగాడి చుట్టూ గాఢాంధకారం ఇండిపెండెంటుగా ఏదీ చెప్పలేడు, చెయ్యలేడు తను చేస్తున్నది తప్పని తెలిసినా చుట్టూ వున్న వత్తిడివల్ల చెయ్యక తప్పటంలేదు సెక్యూరిటీ లేదు స్టేటస్ లేదు ఏమంటే ఎవరికి కోపం వస్తుందో, ఎప్పుడు ఎవరికి ఆగ్రహం వచ్చి ఉరుము ఉరిమి ఎక్కడ తన నెత్తిమీద పడుతుందో అని భయం ఈ భయాల వలయంలో చిక్కుకొని ఇలాపాటి ప్రతిభనయినా ప్రదరిస్తున్నందుకు మీ అంచరి సానుభూతి కోసం, చప్పన, త్వరలో నాలా చావబోతున్న ఛాయాగ్రాహకులకు ఇూ బుల్లి వ్యాసం అంకిత మిస్తున్నాను



నెల్లూరుజిల్లా ప్రజా సంబంధాల అధికారిగా పని చేసి ప్రస్తుతం సమాచారశాఖ అసిస్టెంట్ డైరెక్టరుగా హైదరాబాదు వెళ్తున్న శ్రీ చంద్రశేఖరయ్యగారికి నెల్లూరులో నెహ్రువారు పీడ్కోలు సభ ఏర్పాటు చేసి సన్మానించారు సన్మానం చేసిన జిల్లా పరిషత్ అధ్యక్షుడు డా బాల చెన్నయ్య, నెహ్రు సుందరరామిరెడ్డి, శ్రీ చంద్రశేఖరయ్యగార్లని చిత్రంలో చూడవచ్చు




## ఎస్. ఎస్. ఏ — వలాప

నేను నిజంగా ప్రేమించాను, ఉత్తరాలు రాశాను సినిమాలకి వెళ్ళాం అతనే నా ప్రపంచం అనుకున్నాను

★ చాలా పొరపాటు — ప్రేమించడం అంటే — ప్రేమలేఖలు రాసుకోవడం సినిమాలకీ హోటళ్ళకీ వెళ్ళడం కాదు ఇద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకుందుకు ప్రయత్నించాలి ముందు

## జి. ఎల్. బి. — ఖర్గపూరు

నేటి సమాజంలో స్త్రీ విలువ ఎంత ?

★ ఆమె — తనకు తానిచ్చుకుంటున్నంత!

మాట విలువ తెలియని మనుషులతో ఎలా ఉ ల్లాడమంటారు ?

★ విలువలేని మాటలు మాత్రమే మాట్లాడి వూరుకుంటే పోలే ?!

## బి. వి. ఆర్ — కాకినాడ

రామలక్ష్మిగారూ, ముమ్మిడివరం బాలయోగిపై మీ అభిప్రాయం ?

★ యోగి అవునో కాదో గాని ముందా గోళ్ళూ గట్టా కత్తిరించుకుంటే బాగుండును ?

## జె. ఎస్. ఆర్ — బొంబాయి

ఆడదాన్ని రేప్ చేస్తే జైలుశిక్ష ఉరిశిక్ష వేస్తారు కాని ఆగది మగవాడిని పిచ్చివాడిని చేస్తే ఏ శిక్ష వెయ్యాలి ?

★ ఎవరికి ? తనని చూపి ఎవరికో పిచ్చెక్కితే— అది ఆమె తప్పా ? !

## జి వి. ఎల్ — హాళగుండ

ఈ సినిమాలలో క్లబ్బు డాన్సులు మా స్త్రీ జాతిని తల వంచేస్తున్నాయి

★ మీరు చూడడానికని కాదు—అవి అవి పిక్చరు వ్యాపారం చేయడం కోసం ముగ్ర్రేక్షకుల కోసం

## ఎం. ఏ. జె. — ఆత్మకూరు

పిల్కుస్మిత, జయమాలిని ప్రాంతీయ పార్టీలు పెడితే ఎవరి పార్టీ విజయఢంకా మ్రోగిస్తుంది ?

★ ఎవరిదీ కాదు ఎందుకంటే — యీ దేశంలో ద్వంద నీతి ఎక్కువ స్మితనీ జయమాలినినీ నోరూర్చుకుంటూ చూస్తారేగాని పబ్లిక్‌గా సపోర్టు చెయ్యరు మన వాళ్ళకి కోరికలు గట్టర్స్‌లోనూ కబుర్లు గంగలోనూ వుంటాయి !

## కె. ఎ. ఆర్. — డోర్నకల్

మహిళ ప్రధానిగా గల ఈ దేశంలో మహిళలపై జరుగుతున్న వరకట్న బలుల నుంచి విముక్తి ఎప్పుడు ?

★ బోడిగుండుకీమోకాలికీ ఏం సంబంధం? మహిళ ప్రధానిగా వుంటేనేంగాక, — ఆడదాన్ని గౌరవించే తత్వం మగవాళ్ళకి వుండాలి గాని

## కె. ఎస్ — తుని

నేను నీ అభిమానిని ప్రేమ వివాహాలపై నీ అభిప్రాయం ?

★ ప్రేమ వివాహాలు చాలా బాధ్యతతో కూడినది జాగ్రత్తగా పెంచుకుంటూ రాకపోతే— కూలిపోతాయి అప్పుడు ఎవరి మీదా బాధ్యత పెట్టడానికి కూడా వుండదు

## ఎమ్ వి ఆర్ — మైదుకూరు

అడిగితే — చెప్పవలసినది ఏది ? అడక్కపోయినా చెప్పవలసినది ఏది ?

★ అడిగినా అడక్కపోయినా—విషయంపై మన అభిప్రాయం చెప్పవచ్చు కాని ఎవడడిగాడు? ఎవరు చెప్పమన్నారీ బోడి అభిప్రాయం, అనుకోడం తప్పదు

## కె.వి.ఎస్ ఆర్ — హైద్రాబాదు

స్త్రీ తన చావు భర్త కంటే ముందు రావాలని కోరుకుంటుంది ఎందుకు ?

★ బతికి వుండగా పడ్డపాట్లు చాలక — అతగాడు పోయాక—యింకేం పడవలసి వస్తుందో నన్న పిరికితనం— అలా కోరేలా చేస్తుంది అనుకుంటా !

## ఎల్ ఆర్ ఎల్ కె — కొట్టూరు

ఈ సృష్టిలో పనికిరానిది ఏది ?

★ ఏం లేదు

## ఎస్. ఎస్. ఆర్. — దొంతకూరు

తెలుగుదేశంలో ఆడ ఎం. ఎల్. ఏ. ల గిరాకీ పెరుగుతోంది. మీరు ప్రయత్నించ కూడదూ ?

★ ఎన్. టి. ఆర్. కూడా కబుర్లే కాని ఆచరణలో ఆడవారికి చేస్తున్నదేం లేదు. చూశాంగా— ఎంతమంది స్త్రీలకి ప్రాతినిధ్యం వహించారో ? ఏ పార్టీ అయినా అంతే— ఆడవాళ్ల ఓట్లుతో గెలుస్తారు. గెలవగానే వారిని వెనక్కు నెట్టుతారు. స్త్రీల పార్టీ ఒకటి పెడితేనేనా— ఏమైనా ఫలితం వుంటుందేమో ? అధికారం ఇవ్వకుండ, లేకుండా— ఆడవాళ్ల స్థితి మెరుగుపడుతుందనుకోవడం— పొరపాటు. ★

---

మొట్టమొదటిసారిగా తెలుగులోకి అనువదింపబడిన 'శ్రీవిష్ణు సహస్ర నామావళి వివరణ' పుస్తకాన్ని ఇటీవల రాజ్‌భవన్ (హైదరాబాదు)లో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ రామ్‌లాల్ విడుదల చేసిన సందర్భంగా శ్రీ రోహిణి వెంకయ్య (రచయిత్రి భర్త), రచయిత్రి శ్రీమతి రోహిణి వెంకట సుందర వరద రాజేశ్వరి, గవర్నర్ శ్రీ రామలాల్ గార్లని చిత్రంలో చూడవచ్చు



# చీకటి పడేవరకు ఆగండి - అప్పుడు "మామా" యొక్క ప్రకాశం చూడండి.



మీరు ఎన్నో రకాల బల్బులు వాడుతూ ఉంటారు. ప్రతీది మీకు మంచి కాంతినిస్తుందని ఆశిస్తూ ఉంటారు. కాని ఓల్టేజి హెచ్చుతగ్గులకు తట్టుకోలేక కాలిపోతూ ఉంటాయి. అయితే అట్టి ఓల్టేజి హెచ్చు తగ్గులను తట్టుకొనే శక్తి "మామా" బల్బులు కున్న ప్రత్యేకత. విద్యుచ్ఛక్తికి అనుకూలంగా ప్రకాశిస్తూ ఉంటుంది. సాటిలేని ప్రత్యేక సాంకేతిక నిర్మాణంతో తయారు చేయబడిన ఫిలిమెంటువల్ల ఫ్యూజు పోయే అవకాశంలేదు. అందుచే నిత్యం నిరాఘాటంగా ప్రకాశిస్తూ నిశిధాన్ని పారద్రోలుతూనే ఉంటుంది.

మార్గదర్శి మార్కెటింగ్. నాణ్యమైన ఉత్పత్తులను వెలుగులోకి తీసుకొస్తుంది.




''మామా''తో భవిష్యత్ దివ్యంగా ప్రకాశిస్తుంది.

సీరియల్:

# గోరంత దీపం

## — వింధ్యవాసిని

(గత సంచిక తరువాయి)

రావు ఖర్చుపెట్టే తీరు చూసి, వాళ్ళ నాన్న ఏ పెద్ద ఉద్యోగస్తుడో, మోతుబరో, వ్యాపారో అయుండాలనుకున్నాడు, హరి అదేంకాదు, అతనెప్పుడూ స్నేహితుల డబ్బుతో జల్సా చేస్తాడని, తన క్లాసువాళ్ళే ఇద్దరు ముగ్గురు చెప్పినా హరి "గిట్టనివాళ్ళ మాటలు" అనుకున్నాడుగానీ నమ్మలేదు.

తన అంచనాయే తప్పు అనీ తెలిసిపోయిందొక రోజు. నీరుకావి పంచ, సైను చొక్కా తొడుక్కుని భుజంమీద మాసిన టవలు వేసుకుని ఉన్న ఓ పల్లెటూరి రైతు ఒకాయన తమ రూముకి వచ్చాడా రోజు. అతను రావు కావాలని అడగ్గానే మర్యాదగా కూర్చోబెట్టాడు హరి. తనేమీ అడక్కపోయినా అతనే హరిని మాటల్లో పెట్టి ఎన్నో మాటలు చెప్పాడు

"ఈయన ఇంతే బాబూ! ఎప్పుడొచ్చినా గదిలో దొరకడు. ఎప్పుడూ ఏవో తిరుగుళ్ళే. అక్కడ పాపం పూజారయ్యగారు ఎంత బాధ పడతారో ఈయన కోసం. నానాతిప్పలు పడి డబ్బు పంపిస్తారు ఈయనేమో, సరిగ్గా చదువుకుని, తనని ఉద్ధరిస్తాడని ఆయన ఆశ. ఈ నెల మొదట్లో కొంచం కటకటగా ఉండి పైకం పంపలేదంట ఆయన. ఈయన కోపం వచ్చి జాబే రాయలేదు. నేనిటువయిపు పనిమీద వస్తే నాకిచ్చి పంపించారు, అలాగే చూసొచ్చి నట్లవుతుందని."

రాత్రి ఎనిమిదింటికి గదికి వచ్చిన రావు తనకోసం వచ్చిన మనిషిని చూసి మండిపడి పోయాడు "ఏమయ్యా!నువ్వెందుకొచ్చావిక్కడికి? ఏ మా నాయనకి పోస్టులో పంపేందుక్కాడా ఖర్చు దండుగ అని, నీకిచ్చి పంపేడా ?.. నువ్వు నాకోసం వచ్చావని తెలిస్తే, నీ ముఖం ఎవరయినా చూస్తే నాకు ఎంత అవమానమో! వస్తే వచ్చావు హరికి డబ్బిచ్చేసిపోతే ఏం మునిగి పోతుందీ ?. . ఈ కుర్రాడు ఫర్లేదు మంచోడేలే భయంలేదు. ఇంకెప్పుడొచ్చినా అలాగే చెయ్యి. పద పద, బయల్దేరిక మేం భోజనానికి పోవాలి" అని అతన్ని తరిమేశాడు.

నిశ్శబ్దంగా చూస్తూ ఉండిపోయాడు హరిప్రసాద్.

"నీకు తెలీదు హరీ. ఈ రామయ్యగాడొట్టి రోగ్. చూడ్డానికలా అమాయకంగా కనిపిస్తాడు కదూ ? ఉన్నవీ లేనివీ కల్పించి మా వూరెళ్ళి ఎన్ని కధలు, కబుర్లు చెప్తాడో ఇక్కడివి ఒట్టి తంపులమారివాడు వాడెప్పుడు వచ్చినా లోపల కూర్చోనియ్యద్దు."

వచ్చిన మనిషి చెప్పిన మాటలన్నీ విన్న హరికి మనసాగలేదు "పాపం జాబు రాయలేదని బాధపడుతున్నారట, మీ నాన్న ఓ ఉత్తరం రాసెయ్యి రావ్!" అన్నాడు.

"ఓహో అలా అని వాడు చెప్పాడా ఆ ముసలాయన నెలకి వందా ఏభయి పంపేందుకు ఏడుస్తాడు. అంత చాతగానివాడు కాలేజీలో ఎందుకు చేర్చాలి కొడుకుని ? నేనిక్కడేదో అందలమెక్కి ఊరేగేసేస్తున్నాననుకుంటాడు. పెద్ద చదువులు చదివి, పెద్ద పెద్ద ఉద్యోగాలు చేసి సంపాదించి పోస్తే హాయిగా కూర్చుని తినాలని కాచుకుని ఉన్నాడు నీలా ఎవరూళ్ళేని వాడిపనే హాయి ఏ బాధ్యతా నెత్తిన పడదు మా ఇంట్లోనే చూడు నా వెనక ఇంకా అయిదు మంది ఉన్నారు సైన్యం. నేను ఉద్యోగం చేసి వాళ్ళందర్నీ నెత్తినేసుకోవాలని మా నాన్న ఉద్దేశం అందుకే చదువు అవకుండా ఉంటేనే హాయి అని ఇలాగే ఉండిపోయాను, నేను" ఏదో గొప్ప రహస్యం చెబుతున్నవాడిలాగా అన్నాడు

రావునెలా అర్థం చేసుకోవాలో తెలియలేదు హరికి తల్లిదండ్రుల ప్రేమకి నోచుకోని తన లాంటివాళ్ళే కాదు, ఉన్న అమ్మ నాన్నల్నే అసహ్యించుకునే దౌర్భాగ్యులూ ఉంటారా! అని పించింది

"బొత్తిగా వ్యాపారస్తుడిలా ఆలోచిస్తున్నావేమో బ్రదర్! పిల్లలని పైకి తెచ్చేందుకు నానా అవస్థలూ పడే తల్లిదండ్రులు, తమ బాధ్యత కొంతయినా పిల్లలు భరించాలని ఆశించటంలో తప్పేముంది ?"

"తప్పా, తప్పున్నరా! ఈ కాలం ఎవరికెవరు తోడుంటారు ? ఎవరి బాధలు వాగు పడాలిసిందే. నేను మట్టుకు ఈయేడు పాసయితే ఏం చెయ్యాలో నిర్ణయించి పెట్టుకున్నాను మా మూకకి దూరంగా ఏ మద్రాసో, బొంబాయో వెళ్ళిపోయి ఉద్యోగం చూసుకుంటాను"

ఇంకేమీ మాట్లాడాలనిపించలేదు హరిప్రసాద్‌కి.

ఆ ఏడు పరీక్షలకి ముందొక గొడవ జరిగింది. హఠాత్తుగా కాలేజీ గోడల మీదెక్కింది రావు పేరు, సుజాత అనే మరో అమ్మాయి పేరుతో చేరి ఆ అమ్మాయి హరి క్లాస్‌మేటే చూడటానికి చక్కని కనుముక్కు తీరు, మంచి ఛాయతో అందంగా వుంటుంది క్లాసులో శ్రద్ధగా పాఠాలు చదువుకునే వాళ్లలో ఆ అమ్మాయి ఒకర్తె అసలామెకీ, రావుకీ ఏలా స్నేహం కుదిరిందా అని ఆశ్చర్యం వేసింది హరికి. గోడల మీద రాతల్నీ, నలుగురూ చెప్పుకునే మాటల్నీ బట్టి చూస్తే వాళ్ల స్నేహం, చాలా దూరమే అంటే సినిమాలు, పార్కు షికార్ల వరకే కాక హోటల్ గదుల్లో గడపటం దాకా వచ్చిందని తెలిసింది.

**జరిగిన కథ — 7:** 'గోరంత దీపం' రాయలసీమ వార్తా వారపత్రిక ఎడిటర్ విశ్వమూర్తి, ఎం డి పరశురామ్ ప్రాణస్నేహితులు విశ్వమూర్తి కూతురు రమణ అదే ఆఫీసులో పనిచేస్తోంది. పరశురామ్ కూతురు కరుణకు ట్యూషన్ చెబుతున్న హరిప్రసాద్ కరుణ సహాయంతో ఆ ప్రెస్‌లోనే ఉద్యోగం సంపాయిస్తాడు. మంచి తెలివితేటలు, చొరవ గల హరిప్రసాద్‌కు తన పెద్దకూతురు అరుణను ఇచ్చి పెళ్లి చేయాలని నిశ్చయించుకొంటాడు పరశురామ్. గతంలో — గుండూరావ్ ప్రెస్‌లో పని చేస్తుంటాడు విశ్వం. ఇంట్లో వాళ్లకు తెలియకుండా తమ కులం కాని మీనాక్షిని చేసుకొని ఆ వూర్లో కాపురం పెడతాడు. తన స్నేహితుడు పరశురామ్‌ని కూడా తీసుకొచ్చి ఆ ప్రెస్‌లోనే చేర్పించి, తన ఇంట్లోనే ఉంచుకొంటాడు పరశురామ్‌కి చదువు లేకపోయినా వ్యాపారంపై ఆసక్తి ఎక్కువ. అందువల్లే క్షణం తీరికలేకుండా ఏవో చిన్న చిన్న వ్యాపారాలు చేస్తుంటాడు. గుండూరావ్ కూతురు కామేశ్వరిని పెళ్లి చేసుకొంటాడు పరుశురామ్. తన భార్య మీనాక్షి కాన్పు కష్టం అయి చనిపోగా విశ్వం బెంగుళూరులో వున్న వొక ఆంగ్ల పత్రికలో రిపోర్టర్‌గా చేరతాడు. 'గోరంత దీపం' అనే వారపత్రికను పరశురామ్, విశ్వం కలిసి నెలకొల్పుతారు. హరిప్రసాద్, రమణ ప్రేమించుకుంటారు. హరి తన పుస్తకం పబ్లిసిటీ వర్క్‌మీద హైదరాబాదు వెళుతూంటే కరుణ వీడ్కోలు చెప్పను స్టేషన్‌కు వస్తుంది. రైల్లో తన చిన్నతనపు రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటాడు హరి— తన తండ్రి తల్లిని వదిలేయగా తను అనాధగా, తల్లి అక్కడే ఆయాగా ఒక అనాధశరణాలయంలో చేరుతారు తల్లి మరణిస్తుంది. కాలేజీలో చదివే రోజుల్లోనే రావు పరిచయమవుతాడు.

ఒకరోజు మాటల్లో పెట్టి "ఇదంతా నిజమేనా ?" అని అడిగాడు హరి రావుని.

"ఏం ? కట్టుకథలనుకుంటున్నావా ? ఆ పిల్లే నా వెంటబడితే నేనేనా ఊరుకునేది ? అయినా నీకిలాంటివి తెలీవుగానీ, ఈ కాలంలో ఆడపిల్లలు బలే బరితెగించి పోతున్నార్లేరా !"

ఒళ్లు మండింది ఆ మాటలకి. అయినా తన కెందుకని నోరు విప్పలేదు హరి. అసలు తనిలాంటి విషయాలతో మనసు పాడుచేసుకుంటే, తన చదువు పాడవటంతప్ప ఒరిగే లాభమేమీ లేదని, సీరియస్‌గా చదువులో పడిపోయాడు, రావు కార్యక్రమాలు, రాకపోకలు ఏవీ పట్టించుకోకుండా.

రావుకి చివరి పరీక్ష ఆరోజు. ముందురోజు రాత్రి పదిగంటలకి గది చేరాడు. హరి ఏమీ అడక్కపోయినా తనే చెప్పాడు. "ఈ రోజో తమాషా జరిగింది బ్రదర్, ఆ సుజాత లేదూ వాళ్ల నాన్న ఇంటికి పిలిపించి మాట్లాడేదు నాతో. అబ్బ ఎంత పెద్ద ఇల్లో ! బాగా డబ్బు, ఆస్తి ఉన్న వాళ్లే అని తెలుసుగానీ, ఇల్లూ అదీ ఎప్పుడూ చూడలేదులే నేను. కూతుర్ని పెళ్లి చేసుకొమ్మని అడిగితే బాగుండేది. ముసలినక్క, అయిదు వేలు ఇస్తాను, మా అమ్మాయి జోలికి రావద్దని బతిమాలుకున్నాడు— మరో సంబంధం చూసుకున్నాడట దానికి. పోనీ పాపం, మనకీ మాత్రం లాభం దొరుకుతోంది కదా అని ఒప్పుకునేశాను, వెంటనే చెక్ ఇచ్చేశాడు. రేపు పరీక్ష అనగానే నాదార్ని నేను పోయేందుకు సరిపోయేంత డబ్బు ! అదృష్టం అంటే నాది కదూ ?"

"అవును. నిజమే" అన్నాడు, హరి పరధ్యానంగా, తను చదువుతున్న పుస్తకం నించీ దృష్టి మరల్చకుండానే.

పైకి అలా ఉన్నా లోపల ఆలోచిస్తూనే వున్నాడు. నిర్మలంగా ఉన్న నీళ్లలో రాయి విసిరినట్టుగా కదిలిస్తాయి రావు మాటలు, హరి మనసుని ఆ అమ్మాయిని క్లాసులో రోజూ చూడటమే గానీ, ఎటువంటి వ్యక్తో తనకి తెలీదు. ఆ పిల్లా రావు లాంటిదే అయి, క్షణికమయిన మోజు కోసమే వెంటబడి వుంటే బాధ లేదు. కానీ నిజంగా వీణ్ణి ఆమె మన స్ఫూర్తిగా ప్రేమించి వుంటే, ఇలా డబ్బు తీసుకున్నాడని తెలిస్తే ఆమె మనసు ఎలా తట్టుకుంటుంది ?

నిజా నిజాలు హరికి తెలియలేదు. రావు మద్రాసు వెళ్ళిపోయాడు. సుజాతకి పెళ్ళయి పోయింది. పోనీ కాస్త అల్లరి పడితే, ఏ అఘాయిత్యము జరగనందుకు సంతోషించాలి అనుకున్నాడు హరి.

## 21

అలా విడిపోయిన రావుని మళ్ళీ కలుసుకోగలనని, హరిప్రసాద్ ఎప్పుడూ ఆశించలేదు. అతను ఎన్నో ఉద్యోగాలు మారి, మార్కెటింగ్ అండ్ అడ్వర్టయిజ్ మెంట్ డిప్లమా చేసి, ప్రస్తుతం హైద్రాబాదులో ఓ పబ్లిసిటీ కంపెనీలోపనిచేస్తున్నాడని ఆ మధ్యే తెలిసింది, అదీఅతమత్తరం రాస్తే. తనకి రచయితగా కొంత పేరొచ్చి, 'గోరంత దీపం'లో చేరిన తర్వాత, తన అడ్రసు కనుక్కుని రావే ఉత్తర రాశాడు. తనకిప్పుడు వాళ్ళ కంపెనీ సర్వీసు అవసరమయి, అతని దగ్గరికి బయలుదేరాడు.

దగ్గరువున్న సిగరెట్లన్నీ కాలిపోయాక ఎప్పుడో నిద్రపట్టింది హరిప్రసాద్‌కి. అతను హైదరాబాదులో దిగి, హోటల్ అయోధ్యలో ముందుగా బుక్ చేసుకున్న గదిని చేరేసరికి ఆరున్నరయింది. స్నానమూ, టిఫిను, కాఫీ అవనిచ్చి కాస్సేపు విశ్రాంతి తీసుకున్నాడు రావు ఆఫీసుకి వెళ్ళేందుకింకా చాలా టయిముంది

ఆఫీసులో చీఫ్ సబ్ శంకరంగారికీమధ్య ఆరోగ్యం బావుండటంలేదు వయసూ ఏభయి దాటింది. అప్పుడో ఇప్పుడో ఉద్యోగం మానేసి అమెరికా వెళ్ళిపోతా నంటుంటా డాయన అమెరికాలో కొడుకు డాక్టరుగా ఉన్నాడు చాలా మట్టుకు శంకరంగారు చేసే పనులన్నీ ఈ మధ్యలో హరిమీదే పడుతున్నాయి ఆఫీసుబయట కొన్నిముఖ్యమయిన అసైన్‌మెంట్లకీ,మీటింగులు, కాన్ఫరెన్స్‌లకీ కాస్త డాబుగా వెళ్ళే అవసరం



ఏర్పడింది అందుకని ఈ మధ్యే మూడుసూట్లు కుట్టించాడు వాటిలో లైట్ బ్రౌన్ మీద మేరూన్ చారలున్న సూటు 'లక్కీ' అని ఓ నమ్మకం ఏర్పడింది, అతన్లో

ఇప్పుడా సూటే వేసుకొన్నాడు. మెరూన్, తెలుపు చారల టై, బ్రౌన్ షూ సరిగ్గా మాచ్ అయినాయా లేదా అని సిలువుటద్దంలో చూసి చెక్ చేసుకున్నాడు

హోటల్ అయోధ్యా నుండీ బయటికొచ్చి ఆటో ఎక్కి, హిమాయిత్‌నగర్ బయలుదేరాడు. అతను చెప్పిన అడ్రస్ ప్రకారం ఒకచోట ఆగింది ఆటో ఫేర్ చెల్లించి అటూ ఇటూ చూసాడు రోడ్డు కవతలున్న ఓ రెండంతస్తుల మేడ బాల్కనీకి ఓ నలుపు రంగు బోర్డు తగిలించి వుంది, దానిమీద, "స్ప్రైస్ అడ్వటయిజింగ్ సర్వీసెస్'' అని వుంది.

రిసెప్షన్‌కి వెళ్లి అసిస్టెంట్ ఆర్ట్ డైరెక్టర్ రావు కావాలని చెప్పాడు రిసెప్షనిస్ట్ అతని పేరు అదీ వ్రాసుకుని, రావు ఉండే చోటుకి ఎలా వెళ్ళాలిసిందీ చెప్పింది

అక్కడ గోడలూ, తలుపులు కనుక్కోవటానికి స్టీలు హాండిల్సు మాత్రమే గుర్తుల అంతా ఒకే రకమయిన చెక్కతో పానలింగ్ చేసి వుంది కారిడార్స్‌లో అంతా కార్పెట్‌వేసి వుంది మనిషి వచ్చినా, వెళ్లినా శబ్దం చేయాల్సిన అవసరం ఉండదు

# గోరంత దీపం

చిన్నగా తలుపు మీద వేళ్లతో కొట్టి, "మే అయికమిన్'' అన్నాడు. ఎంత స్నేహితుడయినా, అతని ఆఫీసు కొచ్చాక తనూ మర్యాద పాటించాల్సిందే గద "ఎస్'' అని లోపల్నించి వినిపించగానే, స్టీల్ హేండిల్ తిప్పి, తలుపు ముందుకు తోసాడు ఒక్క అడుగు ముందుకి వేసాడో లేదో బేతింగ్ సూటులో రావు ఓబిలు ముందు నిలుచుని వున్న ఓ అమ్మాయి కన్పించగానే షాక్ తిన్న వాడిలా అలాగే ఆగిపోయాడు ఆ అమ్మాయి సన్నగా, తీగలా, చెక్కిన పాలరాతి బొమ్మలా వుంది

మిత్రుడికున్న అమ్మాయిల జబ్బు, తనకి తెలియనిదికాదు. కాలేజీ రోజుల నించీ అతని బుద్ధి తెలుసు కానీ మరీ ఇంతగా బరితెగించేయటమా, అని అడిగేద్దామా అనిపించింది ఎదురుగా ఆ అమ్మాయి ఉన్నదని తమాయించుకున్నాడు రావు ఆ అమ్మాయిని పక్కనున్న మరో గదిలోకి పంపించేసాడు హరిని రమ్మని ఆహ్వానించాడు నవ్వుతూ

"వాట్ మిస్టర్ రావ్, నువ్ చేస్తున్న ఆర్ట్ డైరెక్షన్ ఇదేనా ? ఎవరయినా ఆఫీసు వాళ్లు ఆ స్థితిలో నిన్ను చూసి వుంటే ఎంత ప్రమాదమో ఆలోచించావా ?''

పెద్ద జోక్ ఏదో విన్నట్లు పగలబడి నవ్వాడు రావు తాపీగా తన్ త్రీస్క్వేర్ సిగిరెట్ అంటించుకుని, మిత్రుడి కొకటి ఆఫర్‌చేసి, అన్నాడు "భలేవాడివే ! ఎంత అమ్మాయిల వెంట బడే వాళ్ళయినా అంత ఫూల్‌ని కాదు బ్రదర్ ఇదంతా మన ఉద్యోగనిర్వహణలో భాగమే మేం ఒక హేర్ రిమూవర్‌కి పబ్లిసిటీ డిజైన్ ప్రిపేర్ చేస్తున్నాము ఆ అమ్మాయొక మోడల్ ఆమెకి మాకు కావలసిన విధంగా ఒక పోజివ్వటం నేర్పుతున్నాను అందులో పర్‌ఫెక్షన్ వస్తే, రేపు ఫొటోగ్రాఫర్ దగ్గరికివెళుతుంది ఇదిగో ఈకెమెరాతో కొన్ని ప్రిలిమినరీ ఫొటోలు తీశాము మొత్తానికి అమ్మాయి మాత్రం పసందుగా ఉంది కదూ ? ఓ పట్టేమయినా పడతా నంటావేమిటి ?''

అతని మాటలన్నీ వింతగాను, అబద్ధానికి బంగారు అంచులు వేసినట్లూ కనిపిస్తున్నాయి చెప్పే తీరు మాత్రం నమ్మేలాగే వుంది

"ఉహూ వీడి పద్ధతేమీ మారలేదు ఇంత వయసొచ్చినా, ఏదీ సీరియస్‌గా తీసుకుంటున్నట్లు కన్పించదు బొత్తిగా కుర్రాడిలా మాట్లాడుతున్నాడు'' అనుకున్నాడు

"స్టేషనుకొచ్చి మా గదికే తీసుకువెళ్దామనుకున్నా హరీ ఉహూ ఎనిమిది గంటలదాకా మెలుకువే రాలేదు అయినా గది అడ్రసు ఇచ్చాను కదా. నువు నేరుగా వచ్చేయాలిసింది. ఏ హోటల్లో దిగావు ?''

హరి చెప్పాడు "పోనీ మంచిపని చేశావు నా గది పేరుకేగానీ స్వతం బాగుంటుంది. ట్రాఫిక్‌గోల. ఎక్కువ ప్రశాంతంగా వుండదు. . ఒక పని చేద్దామా ? నువ్వున్నన్ని రోజులూ నేనే నీతోబాటు హోటల్లో ఉంటాను."

తను వచ్చిన పనిని గూర్చి ప్రస్తావించి, "నువ్వు ఇక్కడున్నావనే మీ కంపెనీకే రావటం. రేట్స్ విషయంలో నీ ఇన్‌ఫ్లూయెన్స్ ఉపయోగించి, మాకు సహాయం చేయాలి" అన్నాడు హరి.

"ఊహు ఫరవాలేదే త్వరలో ది గ్రేట్ నావెల్ రైటర్‌గా నీపేరు ఆంధ్రదేశమంతటా మారుమోగబోతోందన్నమాట.అప్పట్లో మువింత గ్రేట్ మాన్‌వి అయిపోతావని, మేమేవరూ ఊహించలేదులే," అతని మాటల్లో వ్యంగ్యం గుర్తించకపోలేదు హరిప్రసాద్. కానీ అతని కలాంటివి వినీ వినకుండి, పట్టనట్లు ఉండటం బాగా అలవాటు తనకి కావలసిన పని ఉన్నప్పుడు, మన పని జరగాల్సింది ముందున్నప్పుడు, పరిస్థితుల మీద అవతలి వ్యక్తులమీదా కోపం తెచ్చుకోవటంవల్ల ఏమీ ప్రయోజనం ఉండబోదని, అతను యవ్వనంలో అడుగుపెడుతున్న తొలి రోజుల్లో నేర్చుకున్న మొదటి పాఠం.

బ్రీఫ్‌కేస్ తెరిచి, తన పుస్తకం కవర్ డిజైన్ చూపించాడు. ప్రఖ్యాత చిత్రకారుడు డిజైన్ చేసిన చిత్రం అది అది నాలుగు భాగాలుగా విభజింపబడి వుంది. అన్నీ సినిమా షూటింగ్ ఏక్షన్ చిత్రాలే. పాతకాలం జానపద చిత్రం సెటింగ్‌లో, పావురాలు, హంసలు, లేళ్ళ మధ్య పాటలు పాడుతున్న నాయికా నాయకులు— ఇది మొదటిది. రెండోది సాంఘిక కుటుంబ చిత్రం — పెద్ద ఇల్లు బేక్‌గ్రౌండ్ సెటింగ్‌లో, జమీందారులా ఉన్న పెద్ద మీసాలాయన, ఆయన భార్య, పిల్లలతో గ్రూప్ ఫోటో. మూడోవది చేతుల్లో పెద్దతుపాకులతో 'ఢాం' 'ఢాం' అని పేలుస్తూయుద్ధం చేస్తున్న హీరో విలన్ల ఏక్షన్ స్టిల్, పోతే నాలుగవది—కృత్రిమ వర్షంలో తడిసి డాన్సు చేస్తున్న హీరో హీరోయిన్లున్న చిత్రం. నాలుగు చిత్రాల్లోనూ తప్పనిసరిగా కన్పించేవి మూవీ కెమెరా, దానిముందు డైరెక్టర్ కుర్చీ. కొన్ని క్షణాలు బొమ్మని పరిశీలించి 'ప్చ్', అని పెదవి విరిచేశాడు రావు

"అంత సెన్సేషనల్ థీమ్‌కి ఇంత చప్పగా బొమ్మ వేయటం ఏమీ బాగులేదు. ముందుగా ఇది మార్చెయ్యండి. నేను డిజైన్ ప్రిపేర్ చేయిస్తాను బ్రహ్మాండంగా: అట్టమీద బొమ్మ చూసేగదా ఎవరయినా పుస్తకం కొనేది "

"లాభంలేదు రావ్. ఇది ఫైనల్‌గా నిర్ణయించి, మద్రాస్‌లో ఆర్డర్ కూడా ఇచ్చేశాం. దీంతోనే సర్దుకోవలసిందే." నిజానికి ఆ బొమ్మలో ఏమీ లోపం కన్పించలేదు హరికి.

పరశురాం చివర్లో హరి సలహాకూడా అడిగే నిర్ణయం చేశాడు. కానీ రావుతో అనవసరంగా ఆర్గ్యుమెంట్లు చేయటం ఇష్టంలేక ఏమీ అనలేకపోయాడు.

"ఏటా అన్ని పుస్తకాలు పబ్లిష్ చేస్తారే, ఆఫ్‌సెట్ ప్రెస్ లేదూ వాళ్ళదగ్గిర. అన్నట్లు నువ్వు వర్క్ చేస్తున్న పేపరూ వాళ్ళదేకద రెంటింటికీ ఉపయోగమే ఆఫ్‌సెట్ ఉంటే "

"నిజమే. అదే మాట మా ఎడిటర్‌గారు కూడా చాలా రోజుల్నించే అంటున్నారు. కానీ కుదరటంలేదు."

"ఏం ? లక్షలవరకూ టర్నోవర్ చేస్తుంటారు కదా ? ఒట్టి పిసినారిలాగున్నాడే మీ బాస్ ఈ కాలంలో పెద్ద బిజినెస్‌మేన్ అందరూ అలాగే ఉన్నారు భాయ్ 'క్వాంటిటీ' పెంచి డబ్బు చేసుకోవాలనే ఆత్మాశేగానీ, 'క్వాలిటీ' పెంచి, కస్టమర్స్‌ని సంతృప్తి పరచాలని అనుకోరు "

అతన్నలా మాట్లాడనిస్తే అసలు విషయాన్ని రానీయకుండానే రోజంతా గడిపేయ గలడు. అందుకని హరి, "ఏమో ! అదంతా ఇప్పుడెందుకులే అసలు విషయానికొద్దాం మనం" అన్నాడు.

"అగ్గిపుల్ల మొదలు, అమ్మాయిల పెదాల కేసే రంగు దాకా, సబ్బుబిళ్ళ మొదలు సఫారీ సూటింగుల దాకా, జేబులో ఇమిడే ట్రాన్సిస్టర్ల నుండీ, టెలివిషన్ సెట్ల వరకూ, చిన్నదయినా పెద్దదయినా ఏ వస్తువయినా, ఈ రోజుల్లో తగిన పబ్లిసిటీ లేకుండా అమ్మబోవటం చాలా తెలివితక్కువతనం అంటాను. మార్కెట్‌లో ప్రతీ వస్తువుకీ, రకరకాల బ్రాండ్‌నేమ్స్ పుట్ట గొడుగుల్లా పుట్టుకొచ్చి, కాంపిటీషన్ పెరిగి పోతోంది గదా మరి.

ఆదేమిటో మరి ఈ నిజాన్ని మన తెలుగు పుస్తకాల పబ్లిషర్స్ గుర్తించలేకుండా ఉన్నారు ఎన్నో వేల రూపాయల ఖర్చు చేసి ప్రచురించే పుస్తకాలు ఎక్కువమంది చేతుల్లోకి వెళ్లాలంటే, ఆయా పుస్తకంలో ఉన్న గొప్పతనాన్ని ముందుగా టాంటాం వేయకపోతే ఎలా ? ఎటొచ్చీ దానికీ కొన్ని రూపాయలు ఖర్చు చేయాల్సి వస్తుంది మరి "

"మాట మాట్లాడితే, ఉపన్యాసం దంచేస్తాడు. ఇదో జబ్బు', అని లోలోపల విసుక్కున్నాడు హరి.

ఆ రోజు సాయంత్రం, తర్వాత రెండు రోజులు సాయంత్రాలు స్నేహితుణ్ని హైదరాబాదు అంతా తిప్పాడు, రావు హరి ఎప్పుడో కాలేజీలో చదివేరోజుల్లో ఎక్స్‌కర్షన్‌కి వచ్చి చూసినదే హైదరాబాద్ చాలా మార్పులు కన్పించాయి అతనికి ఊరెంత దూరం పెరిగిపోతున్నా, వీధుల్లో జనాన్ని చూస్తే జనసంఖ్య అంతకు రెండంతలుగా పెరుగుతోందా అనిపిస్తుంది సినిమా థియేటర్లు, హోటళ్ల సంఖ్య బ్రహ్మాండంగా పెరిగిపోయింది — అనుకున్నాడు హరి అక్కడక్కడా, కొందరు తన స్నేహితులకి హరిని పరిచయం చేసాడు రావు

మరునటిరోజు, మూడవరోజు, అడ్వటయిజ్‌మెంట్, డిజైన్, సైజు, టైపోగ్రఫీ, ఏఏ పత్రికలో ఇష్యూ చెయ్యాలి లాంటి విషయాలు చర్చించుకున్నారు అకౌంట్స్ ఆఫీసర్‌ని కలిసి, ఎంతెంత ఖర్చు అయేదీ మాట్లాడుకున్నారు.

హరి హైదరాబాద్‌లో ఉన్నన్నాళ్ళు, రావు అతనితోనే వున్నాడు ప్రతీ రోజూ ఏదో ఒక రకం హాట్ డ్రింక్ ఆర్డర్ చేసి తెప్పిస్తున్నాడు

"నువ్వీ అలవాటుని కొనసాగిస్తూనే ఉన్నావన్న మాట" అని హరి అంటే "నువ్వింకా ఎందుకు మొదలు పెట్టలేదా అని ఆశ్చర్యంగా ఉందిరా" అన్నాడు రావు.

తాగిన తర్వాత నిద్ర వచ్చేదాకా, అతను చెప్పే కబుర్లతో తలతిరిగి పోతోంది హరికి తానింతవరకూ ఎన్ని వూర్లు, వుద్యోగాలు



మార్చిందీ, ఎంతమంది అమ్మాయిలతో గ్రంథం నడిపిందీ, ఎందరు తన వెంట బడిందీ, ఎందర్ని తాను వెంటబడి లొంగదీసిందీ అన్నీ కథలుగా వివరించి చెప్పుకొస్తున్నాడు రోజా.

"ఈ పేడంతా ఎందుకు రావ్ ? హాయిగా పెళ్ళిచేసుకోకూడదూ ? ఎప్పాళ్ళిలా 'థిల్' కోసం ప్రాకులాడుతావు. చిట్టచివరికి 'థ్రిల్' లోనే ఏ థ్రిల్లూ లేకుండా పోతుందేమో."

"ఓహో, భలే జోకు వేస్తావురా నువ్వు... పెళ్ళి చేసుకుని మెడకో పసుపుతాడు బిగించుకుని కొనవి పెళ్ళాం చేతిలో పెట్టేస్తే ఇంక మన గొప్పతనమేముందీ ? మన ఫ్రీడం ఏమయి పోతుందీ ?... నువ్ చేసేసుకోవోయ్ త్వరగా ? నీ కెలాగూ అమ్మాయిల దగ్గర చొరవ చేయటం రాదు. నీ అందాన్ని చూసి ఏ అమ్మాయి నీ వెంట పడదు... ఇంక పెళ్ళే బెస్ట్ కదూ?" తాగిన మైకంలో పిచ్చిగా వాగుతున్న వీడితో మాట్లాడటం నాదే తప్పు అనుకుని మౌనంగా ఉండిపోయాడు హరి.

రోజా కలలనిండా రమణే కనిపిస్తోంది. ఒకసారి కర్నూనికి ట్రంకాల్ చేద్దామా అని అప్పించింది. కానీ సమయానికి విశ్వమూర్తిగా రెత్తారంటే తానిబ్బందిలో పడతాడు— అందుకనే ఆ కోరికని అణిచేసుకున్నాడు.

## 22

ఆ వేళ సాయంత్రం బస్సు దిగాడు హరి. ముందుగా గదికి వెళ్ళి స్నానం చేస్తే ప్రయాణం బడలిక తీరి ఫ్రెష్‌గా ఉన్నట్లనిపించింది.

ఓ కప్పు స్ట్రాంగ్ కాఫీ కలుపుకుని తాగి, క్లీనింగ్ కివ్వాల్సిన బట్టలు పాక్ చేసుకుని స్కూటర్ ఎక్కి బయలుదేరాడు.

ఊర్లో దిగిన క్షణంనించీ, రమణని కలుసుకోవాలని మనసు లాగుతోంది. కానీ వాళ్ళ నాన్నగారికి తెలీకుండా, వాళ్ళ ఇంటికి మాటమాటికీ వెళ్ళి ఆమెను ఒంటరిగా కలుసుకోవటం, ఎవరికయినా తెలిస్తే బాగుండదేమో అనిపించింది.

అయినా చూద్దాం ఎలా పిలవుతుందో అనుకుని, అరుణ, రమణ, కరుణలు ముగ్గురికోసం తీసుకొన్న ప్రెజెంట్సు మూడూ స్కూటర్ బాగ్‌లో తీసుకునే బయలుదేరాడు.

ముందుగా పరశురాం గారింటికేసి వెళ్ళాడు. ఆ సాయంత్రం ఏదో ఫంక్షన్ జరిగినట్లు గుర్తించాడు అల్లంత దూరంనించే. రంగు లయిట్ల వెలుగులో రంగు కాగితాలు గాలికి వూగుతూ కనిపిస్తున్నాయి గార్డన్ అంతటా.

"ఏమిటీ హడావిడి ?" అని గేటు దగ్గరే కూర్చుని ఉన్న కన్నయ్యని అడిగాడు.

"పెద్దమ్మాయిగారి పుట్టిన్రోజు బాబూ !"

"ఉహు. కరుణేం చెప్పలేదే నాకు..." అనుకుంటూ లోపలికి నడిచాడు.

వరండాలో పెద్ద రౌండ్‌టేబిల్ చూట్టూ కుర్చీల్లో విశ్వమూర్తి, పరశురాం, అరుణ, కరుణ, రమణ కూర్చుని మాట్లాడు కుంటున్నారు. ముందుగా కరుణే హరిప్రసాద్ రాకని గమనించింది.

"అరే. మాస్టారు ..." అంటూ కుర్చీలోంచి లేచి ఎదురుగా వచ్చింది.

"ఇప్పుడేనా మాస్టారూ రావటం ... నేనడిగింది తెచ్చేరా మరి" అడిగింది ఉత్సాహంగా.

'ఈ అమ్మాయికింత చనువుందా' అని ఆశ్చర్యపోయాడు పరశురాం.

"ఈ పిల్ల చేసిన పని నేను చేయలేక పోయానే" అనుకుని, చిరునవ్వుతో చూస్తూ వుంది రమణ.

అరుణ మాత్రం ఇదేమీ పట్టనట్లు, ముఖాన్ని మరో వయిపు తిప్పుకుని విశ్వమూర్తితో ఏమిటో మాట్లాడుతోంది.

"ఇదిగో తల్లీ నీ బొమ్మలు. ఎంత కష్టపడి తెచ్చానో తెలుసా విరగకుండా భద్రంగా దాచుకో" అని అరగజం పొడవున్న అట్టపెట్టెని అందించాడు హరి. "థాంక్‌యు మాస్టారూ" అంటూ వెంటనే పెట్టె విప్పి ఒకో బొమ్మ బయటికి తీసి అందరికీ చూపెట్టింది, అప్పటి కప్పుడే.

అనుకోకుండా రమణనిక్కడ చూడటం హరికి సంతోషంగా ఉంది. మనసు విప్పి మాట్లాడలేక పోతున్నందుకు బాధగానూ ఉంది. అయినా అదేం బయటికి కనిపించనీయకుండా, రమణ వయిపే వెళుతున్న చూపుల్ని జాగ్రత్తగా తిప్పేసుకుని మిగతావాళ్ని సమీపించాడు.

కుడిపాంటు జేబులోంచి ఇంటిమేట్ సెంట్ బాటిల్ తీసి, టేబుల్‌మీద అరుణ ముందుంచి, "విష్‌యు హేపీ బర్త్‌డే" అన్నాడు కొద్దిగా ముందుకు వంగి.

అంతవరకూ పట్టనట్లు కూర్చున్నా, అతను తన కోసం తెచ్చిన బహుమతికీ, చెప్పిన శుభాకాంక్షలకీ చిరునవ్వుతో 'థాంక్స్' చెప్పటం తప్పనిసరి అయింది అరుణకి.

"అందరూ వెళ్ళిపోయారు. నేను చివరి అతిథిలాగున్నానే !" అంటూ కరుణ ఖాళీ చేసిన కుర్చీలో కూర్చున్నాడు హరి. అతనికటూ ఇటూ రమణా, అరుణా ఉన్నారు. ఎదురుగా ఉన్న పరశురాం అడిగాడు.

"వెళ్ళిన పని అయిందేమోయ్"అంటూ.

"అయినట్టేనండి. మా ఫ్రెండ్ మరో సలహా చెప్పాడు సార్ ! పుస్తకావిష్కరణకి ఎలాగూ ఫంక్షనూ, పార్టీ ఎరేంజ్ చేస్తారు కద మీరు. ఆ వేళ మనూరి నుండీ వెళ్ళి పెద్ద సినిమా దర్శకుడయిన వివేకానంద బాబుని అహ్వానించి ఆవిష్కరణ చేయిస్తే బాగా పబ్లిసిటీ అవుతుంది గదండి."

"ఎవరోయి ఆ ఫ్రెండు ? నీకన్నా గట్టి వాడులా ఉందే" అని గట్టిగా నవ్వాడు విశ్వమూర్తి. అతనికి సినిమా వాళ్ళంటే గౌరవం తక్కువ. ఒట్టి డబ్బారాయుళ్ళు అంటుంటాడు.

అందరివీ భోజనాలు అయినాయి.

విశ్వమూర్తికి స్వంత కారు లేదు. అయన దృష్టిలో అది ఆడంబరం కిందే లెక్క. అందుకే కొనలేదు. స్నేహితుడిది చాదస్తమని పరశురాంకి కోపం. కారు కొనిపించాలని ఎన్నాళ్ళో పోరి విసిగి మానేశాడు. తన కారుని వీలయినంత వరకూ విశ్వమూర్తి అవసరాన్కి అందేలా చేస్తుంటాడు.

కారు, పార్టీకి వచ్చిన అతిథుల నెవర్నో దిగబెట్టి రావటానికి వెళ్ళింది. ఇంకా రాలేదు. విశ్వమూర్తి "ఇప్పటికే లేట్ అయిపోయింది. ఇవాళ శుక్రవారం కూడాను. వెళ్ళిపోవాలి. ఆఫీస్‌కి" అన్నాడు బయలుదేరటానికి లేస్తూ.

హరి, "సార్ నేనూ వస్తాను రండి వెళదాం" అని ఆఫర్ చేశాడు.

ఇటీవల జరిగిన శ్రీ కొడాలి సాంబశివరావు నవలా స్వర్ణోత్సవం సందర్భంగా నంద్యాలలో పూరన సారస్వత సంఘం ఉపాధ్యక్షులు శ్రీ దేశినేని అప్పా కొండయ్యగారు రచయితని సన్మానిస్తున్న దృశ్యం.



"వొవో. వద్దోయ్. నువ్వు అలిసిపోయుంటావు వెళ్ళి రెస్ట్ తీసుకో. రేపుదయం వచ్చేసెయ్ ఆఫీసుకి, చాలు. చూడు నీకేమీ కష్టం కాకుంటే కొంచం మా అమ్మాయిని డ్రాప్ చేసేసి వెళ్ళిపో...ఏమ్మా మరి కాస్సేపుండి వెళతావా?" అని వెళ్ళిపోయాడు విశ్వం.

"పోనీ, ఇవాళ్టి కిక్కడే ఉండిపోమ్మా. రాత్రికి వెళ్ళకపోతేనేం ?" పరశురాం అడిగాడు.

"ఒద్దులెండి బాబాయ్. నేనిక్కడుండిపోతే, తెల్లారి మళ్ళీ నాన్నకి ఇబ్బంది అవుతుంది," అంటూ హరి వెంట బయలు దేరింది.

అరుణ కిదేం నచ్చటం లేదు. విశ్వమూర్తి వెళ్ళు అనటం, రమణ సంతోషంగా బయలు దేరడం చూస్తుంటే విసుగ్గా ఉంది. అయినా హరితో ఆమె ఎన్నాళ్ళ స్నేహమో ఉన్నదానిలా ప్రవర్తిస్తుంటే తనలా చేయలేక పోతోంది. ఎందుకో ?

ఎందుకో ఏమిటి ? వాళ్ళిద్దరూ ఆఫీసు పనులమీద ఎక్కువసార్లు కలుస్తుంటారుగా. అందుకనే !– అనుకుంది. రమణ "వెళ్ళొస్తా" నని చెప్పేలోగా అక్కడినించీ తప్పుకుని తన గదికి వెళ్ళి పోయింది.

స్కూటర్లో పది నిముషాల్లో ఇల్లు చేరారు హరి, రమణ. దారిలో మెల్లగా అడిగాడు, "వాళ్ళిద్దరికీ బహుమతులు తెచ్చి, నీ కోసం ఏమీ తేలేదని అలిగావా రమణా ?" అతని నడుం చుట్టూ చేయివేసి మౌనంగా కూర్చున్న రమణ జవాబేం ఇవ్వలేదు.

స్కూటర్ దిగేక, "మరి నేవెళ్ళిరానా ?" అడిగాడు హరి.

"ఒక్క నిముషం పైకి రండి. ఫ్రూట్ జ్యూస్ తీసుకుని వెళుదురుగాని."

"ఓకే" అని ఆమె వెనకాలే మెట్లెక్కాడు. అంతసేపూ ఆమె చేయి తన చేతిలోనే ఉంధి. పైకి వెళ్ళగానే చేతిని నొక్కి వదిలేసి, "నువ్వు పద. నేనిప్పుడే వస్తాను" అని కిందికి వెళ్ళాడు, రమణకోసం తాను తెచ్చిన చీర పేకెట్టు గుర్తొచ్చి.

రమణ కిచెన్‌లో ఉంది. పేకెట్టు టేబిల్ మీదుంచి, చెప్పులు విడిచేసి శబ్దం చేయకుండా లోపలికి నడిచాడు హరి. డైనింగ్‌హాలు దాటితే వంటగది.

ఒక పక్కగా టేబిలుమీద మిక్సర్ ఉంది. దాని దగ్గర నిలుచుని, మోసంబి పళ్ళు ఒలుస్తోంది రమణ. గడపలో నిలుచుని ఒక్కక్షణం ఆమెనే చూస్తూ వుండిపోయాడు హరి.

తెలుపు పూవులున్న ఆకుపచ్చ పోలిస్టర్ చీరమీద, తెలుపు జాకెట్టు వేసుకుని ఉంది. జాకెట్ చేతులు పొడవుగా వున్నాయి. "ఇదిప్పుడు ఫేషన్ కాబోలు" అనుకున్నాడు హరి.

లయిటు వెలుగులో పచ్చగా కనిపిస్తున్న ఆమె చేతుల్లోని ఆకుపచ్చ గాజులు పనిచేస్తూంటే




ఇతరుల కష్టసుఖాలను తమ కష్టసుఖాల మాదిరిగా చూచేవారికి దయాదాక్షిణ్యాలు సహజంగానే అలవడుతాయి వాటితోపాటు త్యాగంచేసే సంకల్పంకూడా కలుగుతుంది స్వార్ధపరుడై, ఇతరులను దోచుకోదలచిన వారికికూడా ఆయా సందర్భాలను బట్టి ఔదార్యం కలుగుతుంది అలాటప్పడు మంచి మనస్సు కలవారు దానికి దూరంగా ఉండడం సముచితంకాదు కిరాత హృదయుడు ఔదార్యం చూపిన ఈ కథ వినండి

పూర్వం నందినీ నగరంలో బ్రాహ్మణులు బంధుకుడు,విపులుడు అనే సోదరులుండేవారు తండ్రి ఆస్తిని ఇద్దరూ సమంగానే పంచుకున్నారు. బంధుకుడిది జోరైన చెయ్యి విచక్షణలేకుండా వ్యయం చెయ్యడంవల్ల ఆస్తి కొద్ది కాలంలోనే కరిగిపోయింది. కుటుంబ పోషణయే కష్టమయింది. ఆతడు కుచేలుడుగా తయారయినాడు. ఆతని తమ్ముడు విపులుడు దూరాలోచనతో మరొక పట్టణం చేరి వ్యాపారంచేసి గొప్ప శ్రీమంతుడై సుఖంగా కాలం గడపసాగాడు

తమ్ముడి దగ్గరకు వెళ్ళితే, తన అవస్థ చూచి కొంత డబ్బు ఇవ్వగలడని బంధుకుడు అతని ఇంటికి శ్రమపడి వెళ్ళాడు. తమ్ముని మనస్సు చాలా మంచిది. అన్న పరిస్థితి అతనికి అర్ధమయింది. కొన్ని దినాలు అతణ్ణి తన ఇంటిలో ఉంచుకుని ఎంతో గౌరవంగా చూచి విందు భోజనాలు పెట్టాడు తమ్ముని కుటుంబంలోని అందరూ భక్తితో సేవచేశారు. బంధుకుడు ఇంటికి పోవాలని తొందరపడగా, తమ్ముడు ఒకనాటి అర్ధరాత్రి అన్నను తన యింటి గడపలో కూర్చోపెట్టి "అన్నా! నీకు కొంత ధనం ఇవ్వాలని ఉన్నది దాన్ని ఇస్తే నీవు వెళ్ళేదారిలో ఉన్న అడవిలో దొంగలు దోచుకోవచ్చు అంచేత విలువైన రత్నాన్ని స్తాను. దానిని మింగివెయ్యి ఇంటికి వెళ్ళి వమనం చేసుకో. ఆ రత్నం బయటికి వస్తుంది దానిని అమ్మితే ఎంతో డబ్బు వస్తుంది" అని చెప్పి, తెల్లవారుజామున రత్నం మింగించి నందినీ నగరానికి సాగనంపాడు.

అర్ధరాత్రి విపులుడు చెప్తున్న మాటలను, ఆ ప్రక్కనున్న చెట్టుమీద దాగి ఉన్న ఒక దొంగ విన్నాడు బంధుకుణ్ణి చంపి, చీల్చి ఆతని పొట్టలోని రత్నాన్ని తీసుకోవాలనే సంకల్పం అతనికి కలిగింది. ఆ దొంగ ఒక బాటసారి వేషంతో బంధుకుడితో ప్రయాణం చేసి, తన ఊరు నందినీ నగరం దగ్గరే ఉన్నదనీ, ఇద్దరూ, ఒకరికొకిరు సహాయంగా ప్రయాణం చెయ్యవచ్చుననీ చెప్పి నమ్మకం కలిగించాడు అడవిలో తన కోరిక తీర్చుకోవచ్చునని అతడు అనుకున్నాడు వారు అడవిలో ప్రవేశించేసరికి ఒక దొంగల గుంపు వారిని అడ్డగించింది తమ దగ్గర ఏమీ లేదని వీరిద్దరూ చెప్పి, తమ్మ విడిచిపెట్టవలెనని ప్రార్ధించారు. ఆ దొంగలలో ఒకడు "బాటసారుల మోసాలు మనకు తెలియనివి కావు వీళ్ళ రత్నాలను మింగి ఉంటారు వీళ్లను చంపి చీరితే అవి బయట పడతాయి"అన్నాడు "ఒకణ్ణి మొదట చంపుదాము. వాడిలో రత్నం దొరకకపోతే రెండవవాణ్ణి విడిచిపెడదాము" అని మరొకడు అన్నాడు. "సరే" అన్నారు తక్కిన అందరున్నూ అప్పడు బంధుకుడితో వస్తున్న దొంగ ఆలోచించాడు "మొదట ఈ బ్రహ్మణ్ణి చంపితే రత్నం దొరుకుతుంది. తర్వాత, ఎంత బతిమాలినా తన్ను విడిచిపెట్టరు. ఎలాగూ తన చావు నిశ్చయం తానే మొదట చావుకు సిద్ధపడితే— తనలో రత్నం దొరకనందున — బంధుకుణ్ణి విడిచిపెడతారు. బ్రాహ్మణుని బతికించిన పుణ్యమైనా ఉంటుంది" అని తలచి "మీరు మమ్మల్ని నమ్మకున్నారు. చంపదలిస్తే నన్నే మొదట చంపండి"అని అన్నాడు. ఆ దొంగలు అతణ్ణే మొదట చంపారు. రత్నం దొరకలేదు అందువల్ల బంధుకుణ్ణి విడిచిపెట్టారు అతడు సుఖంగా ఇల్లు చేరుకున్నాడు

దొంగ స్వార్ధపరుడూ, క్రూరస్వభావుడూ అయినా, అతని త్యాగగుణం మెచ్చుకోదగినది ★

# గోరంత దీపం

తమాషాగా శబ్దాలు చేస్తున్నాయి. తలలో మల్లె పూవుల గుబాళింపు గదినంతా పరచుకుంది

వెనుకగా వెళ్ళి నడుంచుట్టూ చేతులేసి, "దారిలో నేనడిగిందానికి జవాబు చెప్పనేలేదు నువ్వు" అన్నాడు చిరునవ్వుతో.

"మీచేత 'అయి లవ్ యు' అనిపించిన మీ మనసుని ఎక్కడా పారేయకుండా, నా కోసం భద్రంగా పట్టుకొచ్చారుగా అదే పదివేలు" అన్నది రమణ చిలిపిగా

"ఏయ్ ఏమిటా మాటలు. నా మనసుని అంత సులభంగా పారేసుకుంటానను కున్నావా? అసలు అందులో నీ రూపం చేర్చుకున్న తర్వాత నా మనసెంత బరువెక్కిపోయిందో తెలుసా? నువేమయినా కాస్త సాయం పడతావేమోనంటే, అంత దూరం నించే కబుర్లు చెబుతావు"

"నా పరిస్థితీ డిటో అనుకోండి నేనేం సహాయం చేయగలను?" అంటూ మిక్సర్ ఆన్ చేసింది.

హరికి జోక్ అర్ధమయింది. "అమ్మ దొంగా. నా మాటలు నాకే అప్పగిస్తావా?" అంటూ ఆమెనిటు తనవయిపు తిప్పుకున్నాడు. ఆమె కళ్ళద్దాలు తీసి టేబులు మీదుంచి, తల మీద చేయివేసి, పెదవులమీద ముద్దు పెట్టుకున్నాడు.

కొంచం సేపు ఇద్దరూ పరిసరాలు మర్చిపోయారు. మిక్సర్ చేస్తున్న శబ్దం మొదట హరే గుర్తించాడు ఒకచేయి రమణ చుట్టూ అలాగే ఉంచి, మరో చేత్తో స్విచ్ ఆఫ్ చేసాడు

రమణ 'అయ్యో' అని నాలిక్కర్చుకుని, "జ్యూస్ అయుంటుంది" అంటూ అతన్ని విడిపించుకుని ఇటు తిరిగింది

"జ్యూస్ తాగటం అయిపోయిందిగా? ఇంకెందుకు?" అన్నాడు హరి చిలిపిగా

"ఇదిగో మీరలా మాట్లాడారంటే, నేనసలు మాట్లాడను మీతో" బెదిరిస్తూ, రెండు గ్లాసుల్లో రసాన్ని సర్దింది రమణ

(ఇంకా వుంది)




### జె. ఆర్. ఎస్. – వట్లూరు

మా అమ్మాయికి 5 సం ల ప్రాయంలో ఒక అగ్నిప్రమాదం కారణంగా కింద పెదవి క్రిందుగా కాలి మచ్చగా ఏర్పడింది ప్లాస్టిక్ సర్జరీ చేయించటానికి ఎవరి దగ్గరికి వెళ్ళమంటారు

★ మెడికల్ కాలేజీలతో చేరిన ఆస్పత్రులలో (విశాఖపట్నం, కాకినాడ, హైదరాబాదు, గుంటూరు, కర్నూలు, మద్రాసు, నెల్లూరు) ఈ చికిత్స చేస్తారు

### బి. వి. ఆర్. – కాకివాడ

బల్లమీద పడుకుంటే ఎముకలు ఎదగవు అంటారు నిజమా ?

నా శరీరం మీద తెల్లని మచ్చలు వచ్చాయి పోబి అని హైపో వ్రాశారు పూర్తిగా తగ్గింది మళ్ళీ అదే చోట వస్తున్నాయి ఇది ఏమైనా జబ్బా ?

★ బల్లమీద పడుకోటానికీ ఎముకలు ఎదుగక పోవటానికీ సంబంధం లేదు

మచ్చలు పూర్తిగా పోవటానికి, గ్రైసోవిన్, ఫల్విన్–ఏవ్, ఇడీఫల్విన్ వంటి మాత్రలను రోజుకి ఆరు వంతున వరుసగా 20 రోజులు వాడండి. పై పూతగా హైపోవాడటం మంచిది అదనంగా ఇకోనజోల్ అనే ఆయింట్‌మెంట్ వాడండి.

### పి.వి.ఆర్. – తిరుపతి

నా వయస్సు 18 సంవత్సరములు. నాకు 10 సంవత్సరముల వయస్సునుండి మోకాలు పై వైపున వాపు వున్నది. 2 సంవత్సరముల నుండి క్రిందికిగూడా దిగినది మందులువాడినా ఫలితము కనిపించలేదు.

★ దీనిని "బర్సా" అని అంటారు దీనివల్ల పెద్ద ప్రమాదకరమేదీ లేదు మీరు ఆర్థోపేడిక్ వైద్యులకి చూపించి ఈ విషయం నిర్ధారణ చేసుకోవటం మంచిది

### జి.వి.ఆర్. – చల్లగరిగ

నేను హైడ్రోసీల్ ఆపరేషన్ చేయించుకొన్నాను. 3 నెలలయింది. ఇంతవరకు వాపు తగ్గలేదు. రోజురోజుకి ఎక్కువ అవుతున్నది.

★ మీరు మళ్ళీ శస్త్రచికిత్స నిపుణులకి చూపించి అవసరం అయితే ఆపరేషన్ చేయించుకోవలసి ఉంటుంది ఆపరేషన్ చేసిన చోట నెత్తురు గడ్డకట్టి ఉంటుంది.

### ఎస్. ఆర్. – ఉరవకుండ

నా వయస్సు 29 సం॥లు పెళ్ళి అయి 10 నెలలు అయింది. 4 సం॥ల దాకా పిల్లలు వద్దనుకొన్నాము నిరోధ్ వాడటం వల్ల సంప్కారంలో ఆనందం ఉండటం లేదు లిండియాల్, డు ఓల్యూటాన్, ప్రిమోవ్‌లార్ మొదలయిన మాత్రలు నెలకొక మాదిరిగా వాడుతున్నాము ఇలా మార్చటం వల్ల హానికరమా ?

★ ఇలా నెలనెలా వేర్వేరు కంపెనీల మందులు మార్చటం మంచిదికాదు వాటిలోని మందుల ప్రమాణాలలో కొద్దిగా తేడాలు ఉంటాయి.

### ఎ. ఎ. ఆర్. – విశాఖపట్నం

నా వయస్సు 48 సంవత్సరములు నాకు నెల, రెండునెలల కొకమారు మలములో రక్తము పడుతున్నది మరల కొన్ని నెలలు వుండదు దీనికి కారణమేమిటి ?

★ మలపరీక్ష చేయించుకొని అందులో అమీబాలు లేవని తేలినప్పుడు శస్త్రవైద్యుల చేత గుదస్థానాన్ని ప్రాక్టోస్కోపీ, సిగ్మాయిడోస్కోపీ చేయించి ఏవైనా లోపాలున్నాయేమో తెలుసుకోవలసి ఉంటుంది

మలబద్ధకం రాకుండా చూసుకోవటం చాలా అవసరం

### ఎల్.ఎల్.వి. – రాజమండ్రి

నా వయస్సు 16 సంవత్సరములు. నాకు ముక్కునిండా పుట్టుమచ్చలు వున్నవి ఇవి వున్నందువలన నేను చాలా అందవికారముగా వుండి నలుగురిలో తిరుగలేకుండా వున్నాను

★ మీరు మెడికల్ కాలేజీ ఆస్పత్రులలోని ప్లాస్టిక్ సర్జరీ నిపుణులను కలుసుకోవటంవల్ల లాభం ఉంటుంది

### బి. డి. ఆర్. – బద్రంపల్లి

మా కోడలకు 18 సంవత్సరములు మొదటిసారి గర్భమునందు రెండవ నెలలో స్తనములందు పాలు ఎక్కువగా వస్తూ వున్నవట. అనంతపురం హాస్పటల్‌లో చూపిస్తే వారికి అర్థము కాలేదన్నారట 5 నెలలకు గర్భము పోయినది. తిరిగి ఇప్పుడు మూడవ నెల గర్భవతి తిరిగి స్తనము లందు పాలు వస్తున్నవట ఇలా జరగటానికి కారణము ఏమిటి ?

★ ఇలా రావటం వల్ల ఏ ప్రమాదమూ లేదు. కొందరికి హార్మోనుల ప్రభావం వల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది దీనికీ గర్భం పోవటానికీ సంబంధం లేదు. ప్రొల్యూటాన్ డిపో అనే ఇంజక్షన్ లేడీ డాక్టర్ల సలహాపై చేయించుకోవటం మంచిది. ★



# వంటలు

## ఫ్రూట్ స్వీట్

కావలసిన వస్తువులు పాలు రెండు లీటర్లు, మిక్సెడ్ ఫ్రూట్స్ ఒక టిన్ను, చక్కెర ఒక కప్పు, వెనిల్లా ఎసెన్సు కొన్ని చుక్కలు

తయారుచేయు విధము . పాలను ఒక పాత్రలో తీసుకుని పొయ్యిపై పెట్టి సన్నని మంటమీద కాగనివ్వాలి. పాలు బాగా మరుగుతున్నప్పుడు చక్కెరపోసి కలపాలి. చేయివిడవకుండాగరిటతో కలియపెడుతూ పాలు —చక్కెర మిశ్రమం బాగా చిక్కగా అయ్యేటట్లు చూడాలి. మిశ్రమం బాగా చిక్కగా అయ్యాక పొయ్యిపై నుండి దించేసి చల్లారనిచ్చి ఎసెన్సు వేసి కలపాలి తర్వాత మిక్సెడ్ ఫ్రూట్స్‌లో నుండి రసం పిండేసి పండ్లు మాత్రం పాలలోకి వేయాలి. పాలు — మిక్సెడ్ ఫ్రూట్స్ మిశ్రమం మరీ చిక్కగా వుందనుకుంటే ఫ్రూట్స్‌నుండి పిండిన రసం పోసి బాగా కలుపుకోవాలి ఇది చాలా రుచిగా వుంటుంది. పిల్లలు చాలా ఇష్టంగా తింటారు. బలవర్ధకమైనది.

— ఉదయభానుసుందర్

## గోధుమ హల్వా

గోధుమలు (రుబ్బినవి) — 1 గ్లాసు, తరిగిన బెల్లం — $1\frac{1}{4}$ గ్లాసు, నెయ్యి—$\frac{3}{4}$ గ్లాసు, ఏలకులు — 10, హల్వారంగు చిటికెడు, జీడిపప్పు, కిస్‌మిస్

విధానము — రాత్రి నానబెట్టిన గోధుమల్ని తెల్లారి బాగా కడిగి, మెత్తగా రుబ్బాలి ఒక గిన్నెకు పల్చటి బట్టకట్టి రుబ్బిన గోధుమపాలు అందులో వడపోయాలి. ఈ విధంగా సారమంతా దిగువరకు చేయాలి. గుడ్డ తీసివేసి, ఆ గిన్నెను 4 గంటలవరకు కదపకుండా ఉండాలి. అపుడు పైకి నీళ్ళు తేరుతాయి. వాటిని చాలావరకు వంపేసి, రెండు గ్లాసులు ఉండేటట్లు చేయాలి ఒక గిన్నెలోకి ఈ గోధుమపాలు, బెల్లం, రంగు, సగం నెయ్యివేసి బాగా కలిపి పొయ్యిమీదపెట్టి అడుగంటకుండా కలుపుతూ గరిటె జారుగా అయ్యాక మిగతా నెయ్యి పోయాలి. గిన్నె అంటకుండా ముద్దలా అయ్యాక ఏలకులపొడి, జీడిపప్పు, కిస్‌మిస్ వేసి బాగా కలిపి ఒక పళ్ళెంలోవేసి ముక్కలు కోయాలి.

— షెజాద్ ★

# బూస్ట్ అతను రోజంతా చురుగ్గా ఉండేలా చూడటానికి ఎంతో చక్కటి మార్గం.

మీ అబ్బాయి తాగే గ్లాసు పాలల్లో రుచికరమైన శక్తి నిచ్చే బూస్ట్ ఒక చెంచాడు తీసి కలపండి. ప్రతి ఉదయం.

అంతే, రోజంతా కూడా అతను హైస్పీడ్ రైలులా చురుగ్గా తిరుగుతాడు.

రోజూ ఉదయం స్కూలులో చదువుకోడం, ఆడుతూ, పాడుతూ, ఫుట్‌బాల్ ఆడుకోడం, ఆ తరువాత శ్రద్ధగా గంట సేపు హోమ్‌వర్క్ చేసుకోడం అవన్నీ కూడా చకచకా చేసుకుపోతాడు.

బూస్ట్ యిచ్చే శక్తి అటువంటిది — మీ అబ్బాయి రోజంతా ఆటపాటలతో ఆనందముగా గడపడంలో తోడ్పడుతుంది. ఉదయం నుంచి రాత్రి వరకు.

బూస్ట్‌ని వెన్నగల పాలు, బంగారు రంగు గోధుమ, మాల్టెడ్ బార్లి, రుచికరమైన కోకోలతో తయారుచేశారు. అది మీ బిడ్డ అవసరాలకుగాను శక్తినిచ్చే హైడ్రేట్లను, శరీర నిర్మాణానికి తోడ్పడే ప్రోటీన్లను సమకూరుస్తుంది.






**చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం**

## కార్టూన్ లు పంపేవారికి మనవి

కార్టూన్‌లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ—3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలో గాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్‌లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్‌లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈ కార్టూన్‌లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

# హైదరాబాద్ నోట్‌బుక్

## సురభారతీ సమితి

### వాల్మీకి దినోత్సవం :

సురభారతీ సమితి 13వ వార్షికోత్సవం, వాల్మీకి జయంతి డిసెంబర్ 27న ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో వైభవోపేతంగా జరిగాయి సమితి అధ్యక్షులు రాష్ట్ర హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి అధ్యక్షత వహించారు సంస్కృతం పట్ల ప్రభుత్వం కేవలం మాటలతో ప్రేమ ఒలకబోయడమే తగిన సాయమేమీ చేయడం లేదని, ప్రైవేటు సంస్థలే ప్రజలకు సన్నిహితమైనవి గనుక, వాటి సేవలకు ప్రభుత్వం ప్రోత్సాహమివ్వాలనీ కోరారు వాల్మీకిని గురించి, రామాయణం గురించి ముగ్గురు విద్వాంసులు — సంస్కృతంలో తిరుపతిలోని కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం ప్రిన్సిపాలు డాక్టర్ మల్లాది బాలసుబ్రహ్మణ్యం, ఆంగ్లంలో రాష్ట్ర ప్రభుత్వ కార్యదర్శి శ్రీ పి ఎల్ శివరాం (ఐ ఎ. ఎస్), తెలుగులో డాక్టర్ దివాకర్ల వేంకటావధాని ప్రసంగించారు

ధార్వాడ విశ్వవిద్యాలయం సంస్కృత శాఖాధ్యక్షులు, గొప్ప ఆలంకారికులు డాక్టర్ కె కృష్ణమూర్తి సంస్కృత సరస్వతికి అపార సేవ చేసిన మహనీయులు జన్మించిన పవిత్ర దేశం ఆంధ్రదేశమని అంటూ సురభారతి సేవను ప్రశంసించారు సురభారతీ సమితి ఏటా ఒక పండితోత్తముని సత్కరించే సంప్రదాయానుసారంగా ఈ సంవత్సరం డాక్టర్ మల్లాది బాలసుబ్రహ్మణ్యంగారిని శాలువతోను, నూటపదార్లతోను సత్కరించింది మల్లాదివారి పూర్వులు తెలుగుదేశం నుంచి పుదుక్కోటకు వెళ్లినవారు. శ్రీ సదాశివ బ్రహ్మేంద్రయోగి వంశంవారు ఋగ్వేదం ఘనాంతం అధ్యయనం చేసినవారు అణ్ణామలై విశ్వవిద్యాలయం నుంచి సంస్కృత భాషలో ఎం. ఎ పట్టభద్రులై, పూనా విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పొందారు పిదప శ్రీలంకలో జాఫ్నా విశ్వవిద్యాలయంలో పద్నాలుగు సంవత్సరాలపాటు సంస్కృతాచార్యులుగా వున్నారు అక్కడ ఉన్నప్పుడు బౌద్ధతత్త్వం, పాలీభాష అధ్యయనం చేశారు అలహాబాద్, పూరీ నగరాలలో కేంద్ర సంస్కృత విద్యాపీఠాలలో పనిచేశారు ఇప్పుడు తిరుపతిలోని కేంద్రీయ సంస్కృత విద్యాపీఠం ప్రిన్సిపాలుగా వున్నారు వ్యాకరణ, వేద, వేదాంత, భాషా శాస్త్రాలపై దాదాపు 60 గ్రంథాలు రచించి ప్రచురించారు పెక్కు సంస్కృత మహాసభలకు, ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులకు అధ్యక్షత వహించారు సాధారణంగా సంస్కృత విద్వాంసులు నేటి క్రీడలలో ఆసక్తి చూపరు కాని ఈయన వివిధ క్రీడలలో నిపుణులై విద్యార్థి దశలో ఆల్‌రౌండ్ ఛాంపియనుగా పేరు పొందారు

ఇలాటి విద్వత్తల్లజుని సురభారతీ సమితి సన్మానించి మంచిపని చేసింది ప్రారంభంలో సమితి కార్యదర్శి, ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖాధ్యక్షులు డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు సమితి కార్యకలాపాలు తెలిపే నివేదిక చదివారు చివరన డాక్టర్ రవ్వ శ్రీహరి ధన్యవాదాలు చెప్పారు ఈ ఉత్సవానికి మణిమకుటం ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖావిద్యార్థులు ప్రదర్శించిన మధ్యమవ్యాయోగం ఇది భాసకృతం దీనిలో భీముడుగా శ్రీ కె కళాధర్, ఘటోత్కచుడుగా శ్రీ ఎ రాములు (సంస్కృత ఎకాడెమీ), బ్రాహ్మణుడుగా శ్రీ కృష్ణారావు, బ్రాహ్మణ కుమారులుగా శ్రీయుతులు కాళిదాసు, నాగన్న, రఘురాములు, బ్రాహ్మణిగా కుమారి పద్మావతి, హిడింబిగా కుమారి కె పద్మ చక్కగా నటించి ప్రేక్షకులను ఆనందింప జేశారు నేపథ్య గాయని కుమారి కమలలత కంఠం చాల మధురంగా వుంది శ్రీ వై నారాయణ వయొలిన్ అనుసరణా బాగుంది ఉస్మానియా విశ్వవిద్యాలయంలో థియేటర్ ఆర్ట్స్ విభాగం కొత్తగా ఏర్పడింది ఇకమీద సమితి వారు వారి సలహాను స్వీకరిస్తే, సంస్కృత నాటకాలు మరింత జనప్రియ మవుతాయని నా నమ్మకం

### ఉపశ్రుతి :

ఏం సిద్ధాంతిగారూ మహా హడావుడిగా వెళ్లుతున్నారే ? — అనడిగాను, నన్ను చూచి చూడనట్టు వెళ్లుతున్న ఒక మిత్రుడైన జ్యోతిర్వేత్తను మరేంలేదు మన నాయకులు కొత్తపార్టీ పెడుతున్నారు గాదా? జ్యోతిష్కులను రమ్మన్నారు గ్రహబలం చూచి, మంచి ముహూర్తం పెట్టడానికి అందుకే ఈ తొందర—అన్నారు ఆయన

**— తిరుమల రామచంద్ర ★**

# సద్గురు సంగీత సభ ద్వితీయ సంగీతోత్సవాలు

"ఆంధ్రా పారిస్" బిరుదు వహించిన తెనాలి పట్టణం శతాబ్దాలుగా సాహిత్య లలిత కళలకు పుట్టినిల్లు. తెనాలిలోని సద్గురు సంగీత సభ ఈ రెండు సంవత్సరాలలో ముందంజ వేసి, వేలాది కళాప్రియులు రసికులకు చేసిన సేవ అద్వితీయము.

రావి రంగమ్మ కమ్యూనిటీ హాల్‌లో ఈ సభ ఏడు రోజులపాటు డిసెంబరు 5 నుండి సంగీత ఉత్సవాలు నిర్వహించింది.

డా॥ బాలాంత్రపురజనికాంతరావు (ఆకాశవాణి) ప్రారంభోత్సవము చేశారు.

మంగళవాద్య విశారద, పద్మశ్రీ, తమిళనాడు ఆస్థాన విద్వాంసుడు, శ్రీరంగం క్షేత్రదేవాలయ ఆస్థాన విద్వాంసుడు శ్రీ షేక్ చినమౌలానా నాదస్వర కచేరి, అతని మనుమడు, శిష్యుడు శ్రీ షేక్ కాశిం సహకారము, తిరుచ్చి సుబ్రహ్మణ్యం, వలంగిమాన్ షణ్ముఖసుందరం, కె. టి. ఆర్. స్వామి డోలు సహకారము ప్రేక్షకులను ఆనంద సాగరంలో ముంచెత్తాయి. అధ్యక్షుడు శ్రీ దక్షిణామూర్తి, కార్యదర్శి శ్రీ మధుసూధనవు ఈ గొప్ప కల్యాణ ఉత్సవమును విజయము చేశారు. శ్రీ పి. విష్ణుమూర్తి, శ్రీ పి. వి. వి. గోపాలస్వామి ఎంతో సహకరించారు.

2వ రోజున కళాప్రపూర్ణ పద్మశ్రీ "అపరత్యాగరాజు" శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ కచేరి తనకు తానే సాటి అనిపించింది. వీరి సంగీతము వర్ణింప తరము కాదు. శ్రీ అన్నవరపు రామస్వామి వయలినుపై శ్రీ వెల్లూరు రామభద్రన్ మృదంగంపై సహకరించారు.

"బాగాయనయ్య" (చంద్ర జ్యోతి — త్యాగయ్య, "పలుకుటచే ఫలమేమి" (ఫలమంజరి — పట్నం సుబ్రహ్మణ్యయ్య) వినిపించారు. హంసధ్వని, ఆభేరి, గాయకప్రియ రాగాలాపనలు పండితులను ముగ్ధులను చేశాయి. "మీనాక్షి మే ముదం దేహి" (దీక్షితరు) మధుర గాత్రములో గానం చేశారు.

మూడవ రోజు శ్రీ ఎం. ఎస్. గోపాలకృష్ణన్ వాయులీన కచ్చేరి కర్నాటక సంగీత ఔన్నత్యమును నిరూపించింది.

కీ. శే. పరూర్ సుందరమయ్యరు కుమారుడు శిష్యుడుగా, వాయులీన సాధనతో మేటి అనిపించుకున్నాడు. వీరికుమార్తె కుమారి నర్మద గోపాలకృష్ణన్ సహకరించారు. మృదంగంపై శ్రీ కమలాకరరావు, ఘటంపై శ్రీ పాండిచేరి కే. వి. వైద్యనాథన్ సహకరించారు.

"పాలించు కామాక్షి" (మధ్యమావతి — శ్యామశాస్త్రి) "శంకరి" (బేగడ — సుబ్బరామశాస్త్రి) ప్రత్యేకతను సంతరించుకున్నాయి.

ఉత్సవము 4వ రోజున శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి "శ్రీ త్యాగరాయ చరిత్రము" హరికథ గానం చేశారు. వారి కృతులకు ప్రాముఖ్యత ఇచ్చి, ఎన్నో కృతులను చక్కగా గానం చేశారు.

ఐదవ రోజున ప్రముఖ వైణికుడు శ్రీ చిట్టిబాబు కచ్చేరి ప్రేక్షకులకు హృదయస్పందన గావించింది. గురువాయూరుదొరై మృదంగంపై లయ పలుకులు ఒక లయ విందును పంచిపెట్టాయి. వయసులో చిన్నవాడైనా ఎన్. సోమయాజులు ఘటంపై అద్భుతంగా తన నేర్పును చూపారు.

"వాతాపి", "ఎంత నేర్చినా", "నాదలోలుడై" రమ్యముగా వాయించారు. సావేరి రాగం, కుంతల వరాళి రాగం అద్యంతం ఆలపించారు. శంకరాభరణ రాగంకు ప్రాముఖ్యత నిచ్చి, "స్వర రాగసుధా" (త్యాగయ్య) కృతిని వినిపించారు. హమీరు కల్యాణి, భాగేశ్వరి, "కోకిల పాట" చోటు చేసుకున్నాయి.

"సంగీత చూడామణి" శ్రీమతి మణి కృష్ణస్వామి గాత్ర కచేరి ఆరవరోజున ఒక నూతన సంగీత వాతావరణాన్ని సృష్టించింది. గంభీర గాత్రముతో పరిపక్వము చెందిన సంగీత జ్ఞానముతో వివిధ వాగ్గేయకారుల రచనలు, అపూర్వ రాగాలను కృతులను సంగీత ప్రియులకు మనఃతృప్తిని కలిగించింది.

వయలిను పై శ్రీ సోమయాజులు, మృదంగంపై శ్రీ మాదిరిమంగలం స్వామినాథన్ గాయని మనోధర్మమునకు అనుగుణంగా సహకరించారు.

హరి కాంభోజి రాగం, విజయశ్రీ, ఖరహరప్రియ, కమాస్ రాగాలను శ్రావ్యంగా సాంప్రదాయంగా శాస్త్రీయంగా గానం చేశారు. తోడి రాగాలాపన, తానం, పల్లవి చక్కగా అమరింది.

ఆఖరిరోజున కూచిపూడి నృత్యనాటకం "శ్రీకృష్ణ పారిజాతం" ప్రదర్శింపబడినది. కూచిపూడి నృత్యరీతికి ఒక నూతన జీవమును పోసిన ప్రసిద్ధ నాట్యాచార్యులు శ్రీ వేంపటి చిన్నసత్యం ప్రముఖ శిష్యురాలు కుమారి కె శోభానాయుడు "నృత్య చూడామణి" సత్యభామగా, కుమారి పద్మజరెడ్డి రుక్మిణిగా, కుమారి పద్మరావు శ్రీకృష్ణుడుగా, కుమారి అనూరాధ నారదుడుగా పాల్గొన్నారు.

సత్యభామగా కుమారి శోభనాయుడు తనకు తానే సాటి యని నిరూపించుకున్నారు. రుక్మిణి శ్రీకృష్ణులలో కలహము ఇందులో ఒక ముఖ్య అంశమును నృత్య అభినయములతో రమ్యంగ ప్రదర్శించారు.

శ్రీ మహంకాళి మోహన్ నట్టువాంగం ... మల్లిక్, కుమారి గాయత్రి గానము, మృదంగంపై ఆంజనేయులు, వయలినుపై మురళీకృష్ణ, వేణుపై కన్నన్, వీణపై మాస్టరు శ్రీనివాసన్ ప్రదర్శనకు మెరుగులు దిద్దారు.

— వాసు ★



తెనాలిలో సద్గురు సంగీత సభ ద్వితీయ సంగీతోత్సవాల చివరిరోజు కార్యక్రమంగా కుమారి శోభానాయుడు బృందం ప్రదర్శించిన 'శ్రీకృష్ణ పారిజాతం' కూచిపూడి నృత్య నాటికలో ఒక దృశ్యం. కుమారి జొన్నలగడ్డ అనూరాధ (నారద), కుమారి శోభానాయుడు (సత్యభామ), కుమారి పద్మజారెడ్డి (శ్రీకృష్ణ), కుమారి పద్మారావు (రుక్మిణి)లని చిత్రంలో చూడవచ్చు.

# ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

## లక్ష్మి ఇంటర్వ్యూ

30–12–83 "రాధ, జయసుధ"ల ముఖచిత్రంతో మా ముందుకు దూసుకొచ్చిన సంచికలో నటి "లక్ష్మి" ఇంటర్వ్యూను చదివి, ఆమె జీవితానుభవాలు తెలుసుకోగలిగాము!

గుమ్మనూరు పూర్ణశ్రీ, స్వర్ణశ్రీ,
ఆలూ ›

## చాలా బాగున్నది

'డామిట్! కథ అడ్డం తిరిగింది' ‚ బాగున్నది

వి ఉదయకుమార్, కొత్తక

## హైదరాబాద్ నోట్ బుక్

30–12–83 తేది సంచికలో హైదరాబాట్ నోట్‌బుక్‌లో వైస్ ఛాన్సలర్ ఉపాధ్యాయులకి ఇచ్చిన నోటీసును ఘాటుగా ‚మర్శించారు విద్యార్థులు తరగ‚‚లకి రావాలంటే ప్రస్తుత పరిస్థితులలో అందరి సహకారము చాలా అవసరము కేవలం విద్యార్థులపై ‚ ‚ర్య తీసుకున్నంత మా‚‚ జరిగే పనికాదు కళాశాలలలో ప్రైవేయికుల అల్లరులుగాని జరుగుతున్నప్పుడు చాలామ ఉపాధ్యాయులు తమకు ఏమీ పట్టనట్లు ఊ కుంటారు ప్రిన్సిపాల్ అవస్థ పడతాడులే అ చక్కగా తమ గదుల్లో కబుర్లు చెప్పుకుంట కూర్చుంటారు అల్లర్లు, ప్రైవేయికుల ఒ నప్పుడు కళాశాల మూసివేసినట్లయితే అ రోజులకి ఉపాధ్యాయులకి జీతం ఇవ్వరాద ఎందుకంటే ఆ రోజుల్లో తమ ధర్మం నిర్వర్తించలేదు కాబట్టి "వాళ్ళు వస్తే మేము చెప్పమన్నామా" అంటారు వాళ్ళకి నచ్చచెప్పి తరగతికి వచ్చేటట్లు చేయటం కూడా వీరికి ఉన్న బాధ్యతలలో ఒకటి ఇకపోతే అటెండెన్స ఎంతమంది ఉపాధ్యాయులు తీసుకుంటున్నారో అకస్మాత్తుగా అటెండెన్సు రిజిష్టర్లు చెక్‌చేస్తే బయటపడుతుంది చివరకి అందరికి ఇచ్చేస్తారు అటుండెన్సు అందుకని విద్యార్థులకి కూడా నిర్లక్ష్యం ఏర్పడుతుంది ఇలా చెప్పాలంటే ఇంకా చాలా ఉన్నాయి ఇలాంటివన్నీ గమనించ కుండానే అలాంటి సర్క్యులర్ వైస్ ఛాన్సలరు ఇచ్చాడు అనుకోవటం పొరపాటు

కె రామారావు, హైదరాబాద్ ★

*Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao St Gandhinagar Vijayawada Editor S Radhakrishna*